శ్రీ

# రసపుత్రవిజయము.

చారిత్రక నాటకము.

విశాఖపట్టణ సి. బి. ఎమ్. హైస్కూలులోఁ
ప్రధానాంధ్రోపాధ్యాయులగు


## ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారిచే


రచియింపఁబడియె.




ప్రకటనకర్త;

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీ బుక్కుడిపో,

భీమడోలు, అండ్ బెజవాడ.

కృష్ణాజిల్లా

ఆఱవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1929



కాపీరైటు రిజస్టర్డు]


[వెల 1—0—0

ఈ పుస్తకము యొక్క శాశ్వత కాపీరైటు హక్కు ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారివద్ద నేనుపొందియున్నాను. నా యనుమతి లేనిది యెవరు ముద్రించకూడదు. అట్లతి క్రమించిన నే చేయఁబోవు సివిల్, క్రిమినల్, చర్యలకు బద్ధులగుదురని యిందు మూలముగా తెలియజేయడమైనది.

ఇట్లు,

కురుకూరి సుబ్బారావు,

బుక్కుసెల్లర్ అండ్ పబ్లిషర్,

భీమడోలు, అండ్ బెజవాడ

కృష్ణాజిల్లా

# క్షమార్పణము.



పాఠక ప్రదర్శన మహాశయులారా,

ఈచిన్నపొత్త మనితరలభ్యమగు తమయభిమానావలంబనములఁ గన్నందులకుఁ గృతికన్నెలం గన్నందుల కాయాకృతికర్త లొందు నద్వితీయానందము నాకును బ్రాప్తించినదని సవినయకృతజ్ఞతాపూర్వకముగా మనవిచేసికొనుటకుఁ బూర్వము తమకొక క్షమార్పణము నే సమర్పించుకొనవలసియున్నది. దీనిని ప్రదర్శించిన సామాజికులలో ననేకులును, పోటీపరీక్షలకు దీని నేర్పాటుచేసి ప్రదర్శింపించిన యాంధ్రనాటక పరిషత్తులవారును, ఈ నాటకము తుదిరంగములలో కథాసంవిధానమునందుఁ గొన్ని మార్పులవసరములని నాతోఁ బలుమారులు చెప్పియుండుటచేతను వివిధసమాజములవారు ప్రదర్శించినపుడు ప్రియశిష్యత న్నాటకప్రదర్శనములం దిలకించుచు విమర్శించినపుడు నాకు నట్లే తోఁచుటంజేసియుఁ దుది మువ్వదిపుటలయందును మఱికొన్నిచోటులయందును కథాసంవిధానాదికముల ననేకములగు మార్పులను జేసియున్నాఁడను ఈమార్పులవలన నాటకము మఱింత రసవంతముగా నుండుననియే నాయుద్దేశము. దీని మంచిచెడ్డలు ప్రదర్శించిన వెనుక గాని తెలియవీలులేదు. మంచిదైన నాదరించియు వేఱువిధమైన మన్నించియు భాషాభిమానులగు నాంధ్రసోదరులు మునుపటికన్న నధికతరమగు నాదరణముఁజూపి నాయీకృతికన్యం గౌరవింతురుగాతమని ప్రార్థించువాఁడ.

చిత్తగింపవలయును.

విశాఖపట్టణము,
10—4—20

ఇట్లు బుధజనవిధేయుఁడు,
ఇ॥ యజ్ఞనారాయణ,
గ్రంథకర్త.



# నా ట క ము న వ చ్చు పా త్ర ము లు.



**పు రు షు లు.**

దుర్గాదాసు- } యోధపుర
యోగి } వీరాగ్రేసరుఁడు.

రాజసింహుఁడు- } ఉదయపురపురాణా-
బాటసారి- } కథానాయకుఁడు.

సదరుద్దీన్—మ్లేచ్ఛసర్దారుఁడు.

పకీరు, పెద్దోఁడు- } ఇందిరభర్త, దుర్గా
సావళదాసు- } దాసు బావ.

పిచ్చోఁడు- } దొంగలు, దుర్గాదాసు
చండోఁడు } వేగులవాండ్రు.

హితదాసు—రూపపురమందలి వృద్ధకంచుకి.

అజితసిం } జస్వంతుని పుత్రుఁడు
హుఁడు- } యోధపురపు యువరాజు.

జయసింహుఁడు—ఒక రాజపుత్రయోధుఁడు.

ఔరంగజేబు—ఢిల్లీశ్వరుఁడు, అలంఘీరు.

గులాం—మ్లేచ్ఛసేవకుఁడు.

మయుస్థఖాన్—యవనసర్దారుఁడు.

మహ్మదాజీ—ఒక భిక్షుక పుత్రుఁడు

అక్బరు—అలంఘీరు పుత్రుఁడు.

**స్త్రీ లు.**

వీరమాత- } రాజసింహుని సోదరి, అజితసింహుని తల్లి.

కేసరి—అలంఘీరు భార్య.

విమల—కథానాయిక, కేసరి సోదరి.

ఇందిర- } విమలచెలికత్తె, సావ
మంజరి- } ళుని భార్య,

చంద్రభాగ—కేసరిచేటి.

వీరుగాక మ్లేచ్ఛసైనికుఁడు, కారాగృహపాలకులు, సిద్దీలు, సేవకుఁడు మొదలగువారు వత్తురు.



శ్రీ

# రసపుత్రవిజయము

## నాంది.

ఏరి విశాలరాజ్యమున నెన్నఁడు సూర్యుఁడు గ్రుంకఁజాలఁడే
వ్వారి మహాప్రభుత్వమునఁ బ్రాణులకెల్ల సుఖంబు గల్గు నే
ధీరుల స్వచ్ఛకీర్తి తెలిదీధితిని బాఁటి జగంబుఁ గప్పు, ఆ
భారతవర్ష మేలు ప్రభువర్యుల కీశుఁడు భద్రమీవుతన్. 1

సీ. మేఘమండలమంటు మహికాద్రి కబరీభ
రంబు మకుటంబునై దనరుమీఱ
గిరిశిరంబుననుండి యిరుదెసల్ చను సింధు
వును గంగయును బాహువులుగఁ దనర
సౌరాష్ట్రవంగదేశములు కట్టిన హేమ
చేలాంచలంబులై చెలువుమీఱ
చోళమండల మళయాళ తీరంబులం
ఘ్రిద్వంద్వమో యను రీతి నలరఁ
చారుహిందూమహార్ణవ క్షీరజలధిఁ
దనరు సింహళస్వర్ణ పద్మంబునందు
నిలిచినట్టి మహాలక్ష్మివలెఁ దనర్చు
భరతమాతకు నిత్యంబు వందనంబు. 2

సూత్రధారుఁడు—(నాంద్యంతమున సభవంకఁ దిరిగి యంజలిఁబట్టి) పూజ్యులగు నో సభాసదులారా!

మంజుల వాక్సుమంబులను మామకనాటకవల్లి మిమ్ములన్
రంజిలఁ జేయునంచు ననురక్తిని బొందు బుధాళులార! మీ
కుం జెలువంబుఁ గూర్చినను గూర్పకయున్న సమాదరింప నే
నంజలిఁ గూర్చి యిచ్చు కుసుమాంజలి దీనిఁ బరిగ్రహింపుఁడీ.

(పుష్పాంజలి సమర్పించి)

అహా! నేఁ డెంతసుదినము! ఇతరులు గడింపరాని స్వదేశ విదేశ విద్యలం దుద ముట్ట నభ్యసించి తద్విద్యాప్రసూన మకరందాస్వాదనమునందుం దనివిదీరక నిరంతరము విద్యావ్యాసంగమునందె ప్రొద్దుపుచ్చుచుండుటచేఁ దీఱికలేని పండితప్రచండులను, తెలిపి యీయని రాజకార్యము లనివార్యములై తొందరపెట్టుచున్న నున్నమట్టునఁ దీరుఁబడి చేసికొని వచ్చిన లౌకికశిఖామణులను, ఇఁకను వేలువేలు వ్యాపారముల భారముచే విరామములేని పురజనుల ననేకుల నేకముహూర్తముననే యేకస్థలముననే చూచుభాగ్యము నాబోటి యకించనున కిచ్చోటు లభించినది. నిజముగా నేఁడు కడు సుదినము. ఈ నాటకవ్యాజముననేకదా యిందఱు నామందిరమునకు రా వారి సందర్శించు భాగ్యము గంటిని.

చ. ఇట నొకగంటకిందట జను లెవ్వరు లేరు; క్షణమ్ములోననే
కిటకిట నిండె శాల తిలకింపఁగ వచ్చినవారిచేత; ఈ
తృటి నటరంగ మొప్పు జగతింగలమార్పుల; నెప్పుడెట్లొ? యె
న్నటి కెఱుఁగంగ రాదిదె యనంజను కాలమహత్త్వమద్దిరా. 4

నటి—(చటాలునఁ దెరఁ దొలఁగించుకొని వచ్చి) నాథా! క్రోధమువలదు. వచ్చుచున్నాను.

సూత్ర—ఇదేమివింత! నటీ! నిన్నెవరు పిలిచిరి?

నటి—నాథా! మీరిపుడు నన్నుఁ బిలువనేలేదా? మందిరంబునఁ బనితొందరలో నున్న నేను మీపద్యములోని కడపటిపాదమునందలి "నటి కెఱుఁగంగ రాదిదె యనంజను కాలమహత్త్వ" మను మాటమాత్రము విని యాలస్యముచేసితినని కోపించుచుంటిరేమో యని చటాలున వచ్చితిని. నన్నుఁ బిలువనేలేదా? పోయెద.

సూత్ర—ప్రేయసీ! ఆఁగుము. నిన్ను బిలువవలయుననియే యుంటిని. ఇంతలోఁ గాకతాళీయముగ నీవే వచ్చితివి. ఇంక నాలస్యమేల. నటీ! రంగస్థలాలంకారము పూర్తియైనదా?

నటి—నాథా! కావచ్చినది. ఏమంతతొందర? నాటకమారంభించుట కింకను వేళ కలదే!

సూత్ర—(గడియారమువంకఁ జూచి) నిజమే, కలదు. కాని నాటకముం జూడవచ్చిన బాలురలోఁ గొందఱు కరధ్వనుల సందడిం దొందరఁబెట్ట వేళ మించెనేమో

నటి—ఈబాలకుల కేలుసందడి కాని మీతోనెందఱకాని కాలక్షేపము చేయఁజాలవు గదా? దానికేమి. మీరిప్పు డేనాటక మాడనూహించితిరి?

సూత్రి—రసపుత్రవిజయ మను చారిత్రకనాటకము.

నటి—ఏదేశచరిత్ర? ఏ కాలము నాటిది?

సూత్రి—మనదేశచరిత్రయే. ఇది పదునేడవశతాబ్దాంతమునందలి మన దేశస్థితి తెలుపు కథ.

నటి—ఇందలికథయేమి? కేవలము చరిత్రయేనా? కల్పిత మేమైనఁగలదా?

సూత్రి—అప్పటిచరిత్ర మాతృకగా గ్రహించి రసపుష్టికి పలువురు కల్పనల నెలకొల్పి కల్పించినకథ. ఇప్పుడు దానిసందర్భ మంతయుం జెప్పుట కవకాశము చాలదు. తినఁబోవుచూర రుచియడుగ నేల?

నటి—పోనిండు; గ్రంథకర్త పేరైనం జెప్పెదరా?

సూత్రి—చెప్పెద వినుము.

గీ. నలువకొలమను తనువునఁ దెలుఁగునాటి
శాఖ పూచినపూవు, విశాఖపుర 'మి
షను హాయిస్కూలు' నందొజ్జ, సర్వబుధవి
ధేయుఁ డతఁడు, ఇ॥ యజ్ఞనారాయణుండు. 5

నటి—నాథా! నాకిపు డేమియాజ్ఞ?

సూత్రి—సుందరీ! నాటకారంభమున ఋతువర్ణన మావశ్యకము గదా? చూడుమీ శరత్సమయమున—

చ. దవుదవులన్ హిమాచలము దాఁటి పయోధులఁగప్పి వాసియం
దు వెలయు ఫేనసంతతులతోడను వియ్యమునంది వెండికొం
డవలఁ దలందుఁ జేరి పడినాట్యము సల్పెడి రాజసింహకీ
ర్తివనిత నాఁగఁ జంద్రిక విదిక్కులదిక్కులఁ బిక్కటిల్లెడన్. 6

నటి—మనోహరా! మీఋతువర్ణన మతిరామణీయకము. ఇఁక నేవర్ణించిన దివిటీముందర దీపమే. ఎట్లయినను మీ యాజ్ఞ నల్లంఘింపరాదుకదా!

సీ. విమలమానస మిదే విధమున కొలఁకుల
జలమెల్లఁ దేఁటి నిర్మలతఁ గాంచ

రాజసింహునిచేఁ బరాభూతమౌ శత్రు
సైన్యంబన న్మేఘచయము పాఱ
వీరమాతల సత్ప్రవీణవిఖ్యాతకీ
ర్తియనంగ ధవళచంద్రికలు గాయ
దుర్గదాసరహస్యదూతలనంగ రా
యంచ లాకసమున సంచరింప
మొగలవాహినీతతులయందుఁగల కలుష
పంకమెల్లను రసపుత్రపంకజాప్తుఁ
డుడుప మెల్లమెల్లఁగాఁ దేఱుచుండ శార
దాగమం బగుంగాదె? సౌఖ్యాగమంబు. 7

సూత్ర—సుందరీ! నీవర్ణన మతిరమణీయము. దీనిరూపమునసే నాటకకథ నంతయు సూచించితివి. అదే చూడుము?

ఆ. యోగివేష మూని యోధపురీవిరుఁ
డైన దుర్గదాసుఁ డడవిరాజ
సింహు నెమకికొనుచుఁ జెచ్చెర నిటవచ్చు;
ఉవిద మనకు నిచటనుండఁ జనదు. 8

(నిష్క్రమింతురు.)



The Nellore Progressive Union,
L. P. HALL - NELLORE.
FREE READING ROOM & LIBRARIES.
నెల్లూరు వర్తమాన సమాజము.

# రసపుత్రవిజయము.

## ప్రథమాంకము.

### 1. రంగము:—రూపనగరపరిసరారణ్యము.

[జోధ్పురవీరాగ్రేసరుఁడగు
ఠాకుర్ దుర్గాదాసు యోగివేషమునఁ బ్రవేశించును.]

దుర్గా—ఆహా! భగవదనుగ్రహంబున నెట్టెటో కష్టంబులనెల్లఁ గడచి భర్తృపుత్ర వియోగంబుచేఁ గృశించిన బాలింతరాలగు మాయోధపురేశ్వరితోఁగూడ మగుడ నీయార్యావర్తముం బ్రవేశింపఁగంటిని. ఆహా! ఏమి యీ హిందూస్థాన క్షేత్రమహాత్మ్యము.

సీ. అలహిమాద్రియు వింధ్యనగావళియుఁ జుట్టు
బెట్టనిగోడలై పెంపుమీఱ
వరసింధు సాంపూప్రవాహముల్ త్రవ్వని
పరిఖలై యివల నావలను బాఱ
ఒలిమించు 'ఖైబర్ బోలాన్' కొండకనుమలు
ద్వారంబులవిధానఁ దనరుచుండ
కాశ్మీర నేపాళ కాంతారసీమలు
కేళీవనంబుల లీల నలర
జాహ్నవీనదీసైకతస్థలము లాట
పట్టులును వంగముదినుసుకొట్టు కాఁగ
దుర్గమమగు 'హిందూస్థాన' దుర్గముఁ గనఁ
గన్నతల్లిసి గాంచినకరణిఁ దోఁచు.

కట్టా! ఇట్టిహిందూస్థానమున కీయారంగజేబు కారణంబున నెట్టి దురవస్థ సంభవించినది! ముష్కరుండగు నీయలంఘీరు పరిపాలనంబున నెక్కడఁ జూచినను సాధుజనసంక్షోభంబు తక్క వేఱొండు కానరాకున్నయది. ఏసీమయందును క్షత్రియుల వినాశమును, సత్ప్రియక్షత్రియుల దీనదశయు, హిందువుల క్లేశమును, మితిలేక కన్పట్టుచున్నయవి. వీని రాజ్యతృష్ణ మేరమీఱి యున్నయది.

ఉ. ఎంతటి ద్రోహచింత మది నీకుటిలుండు తలంచినాడు జ
స్వంతు విదేశమం దటులఁ జావఁగఁ బుచ్చె; కృతఘ్నుఁ డంతతోఁ
శాంతుఁడుగాక వానిసతి సాధ్విని గర్భవతి స్వదేశమం
దెంతటిబాముల న్గుడుప నెంచె దురంతపురాజ్యకాంక్షచేఁ. 10

నాఁడు వీఁడు చేయనూహించిన యాదౌర్జన్యమునకు మారవాట్శూరయోధులు మాయండ నుండఁబట్టి కాని లేకుండిన, పాపము! జ్యేష్ఠపుత్రుఁడగు పృథ్వీసింహుని యకాలమరణవార్త విని నశించిన తనపతియగు జస్వంతుని వియోగక్లేశమునఁ గృశించి యున్న బాలింతరాలు, మాయోధపురేశ్వరి గౌరవము చిక్కియుండునా! పసికూనతో మఱల దేశమునఁ బ్రవేశింపఁ గలిగియుండునా!

ఇక్కడితోఁ గడచిగట్టెక్కితిమా! పరమతద్వేషియును, పరరాజ్యాపహరణమార్గాన్వేషియునయిన యీవిశ్వాసఘాతుకుం డింక నేమియేమి దౌర్జన్యంబులం దలపెట్టియున్నవాఁడో! కానిమ్ము. అన్నిటికిని ఆర్తత్రాణపరాయణుండగు శ్రీమన్నారాయణుఁడే కలఁడు.

(కొంతదవ్వునడచి) కటకటా! నడికిరేయినైన బాటసారులు నిరాఘాటముగాఁ బ్రయాణముచేయనగు నీబాటలిపు డెంతహీనదశకువచ్చినవి!

సీ. మోఁటుపాఁతల జారుముడి వెడల న్వ్రేచి
గొంతుల నొక్క తగ్గు లొకవంక
కొండబాఁటలఁ గాంచియుండి పరిచండులై
చెండాడు పిండారిదండొకదెస
గొల్లుగొల్లునఁ బల్లెటూళ్ళపయింబడి
కొల్లఁగొట్టెడి భిల్లకోటి యొకట
నక్కలవలె బాఁట పక్కయిక్కుల నక్కి
చెక్కురు 'గక్కురు' లొక్కచోట

సాధుజనులను బాధించి సమయఁజేయు
వెనుకదీయుని యవహేళపించు లోకట
బాటసారుల ముల్లెలు మూటలుగొను
దారులను గొట్టు దొంగలదండు లోకట.

అవిగో! అదియేదో దొంగలగుంపువలె నున్నది.

[అంత దొంగలగుంపు ప్రవేశించును.]

మొ-వా—అరే! పిచ్చోడా! దొంగతనంగొప్పా? దోఁపిడీగొప్పా! నువ్వు సదువుకొన్నోడివి సెప్పుమా?

రెం-వా—ఓరిపెద్దోఁడా! ఏదిపెద్దో నాకుదెల్దుగాని మనపెద్దయ్యోరోక్క సుద్ది సెప్పివా డిందువురా?

మొ-వా—అదేటో సెప్పు.

రెం-వా—

ఆ. వె. దొంగతనముకన్న దోఁపిడియే పెద్ద
వానిపెద్ద యింటి దానికన్న
కల్లుకన్న పెద్ద ఘనమైన చారాయి
యిచ్చుదాబిరామ యింకరయేమ.

మూ-వా—పెద్దయ్యోరెవ్వఁడా? అడిజేఁవ్వగొయ్యా! ఈసుద్దెంతముద్దుగా సెప్పినాఁడా?

రెం-వా—ఓరి నీబుద్ధిగూల! పెద్దయ్యోర్నెరగారా! పల్లెటూళ్ళ కొల్లగొట్టడానికి పంచాంగంసెప్పు బాపనయ్యోరుగాడంట్రా.

మొ-వా—ఓరి నీగొంతుగ్గొయ్యా! అయ్యోరు మూర్తవాల బాపనయ్యోరా? ఆడిమాట శిలావ్వరాలా! తప్పక దోప్రడే సేతామా.

మూ-వా—పెద్దోడా! నువ్ సెప్పు సుద్ది సరిగాని మరొకటుందిరా. ఇప్పుడీకానలోన మనపాణాలమీదికి రాజసింగొకఁడు దిగుతున్నాఁడంటరా. ఈ కాటిలోని గాకర్లమూఁక లీకాని కేని జోక కాగలేక కాదంట్రా సీకాకుపడి తోకముడుచుకొని పటాపంచలయి పారిపోనారు.

దుర్గా—ఏమి! రాజసింహము: డీప్రాంతముననే యున్నాఁడా! అదృష్టవశమున నెదకఁ దీఁగ కాలందాఁకినది.

చెంబోడు—అక్బరోయి మరిపిపోనాను. అయితే మనమీపొలిమేరదాఁటి పోన పోన జసవంతయ్య దేశానికి పోదాఁరా. ఆడిప్పుడు దేశంలో లేడు. మనాటలు చాగుతాయేమో!

పిచ్చోడు—అదెంట్రా! చెంబోడా! బుద్ధిలేనాలోచన. అడమాత్రం మనోడికన్న మంచోడా!

పెద్దో—ఓరోరి మీబుద్ధులుగూల. ఆడు మొన్న కాబూలులో సచ్చిపోనాడు కాదంట్రా. ఇప్పుడు మొన్న కాబూల్లో పుట్టిన వానికూన కిసంపొయ్యడానికి పాదుసాగారి యాలోసనంట రా!

దుర్గా—అక్కటా! ఆజస్వంతుని సంతానముపయి వీఁడెంతకసి వహించియున్నాఁడు. అఫ్ఘనులచే పడితునని కాబూలు దండయాత్రకు జస్వంతునంపోలి, అతని జ్యేష్ఠపుత్రుఁడగు పృథివిసింగు నోకమిషచే ఢిల్లీకి రప్పించి, కపటసత్కార మొనరించి, విషవస్త్రంబులొసఁగి సంహరించె. తదనుజుండగు నీకసుగందుని పసికందునకు విసంబిడ యత్నించుచున్నాఁడఁట. అక్కటా! వీఁ డెంత నిర్దయుఁడు!

తే. గీ. తండ్రికి విసంబు నిడి చంప దలఁచి చంపె;
అనుజులం దునిమి సామ్రాజ్య మాక్రమించె;
మేలు చేసిన జస్వంతు బాలుగూల్చె;
తుదకుఁ బసికందు నిప్పుడు తునుమ నెంచె. 13

కానిమ్ము; వీని యీపాతుప్రయత్నము సాగకుండ బాలుని మేనమామగారి యింటి కుదయపురమునకుం బంపియుంటిమిక దా! పయిసంగతులుకూడ వినియెద.

మొ-వా—అదిగదిగో! మానిసిజాడరా!

రెం-వా—అవునా! దరికాయురా! దోసుకోరా!

మూ-వా—ఓరోరి! పిచ్చోడా! గోసిపాతలేని గోసాయి; యీఁడికాడేటుందిరా దోసుకోడానికి.

మొ-వా—అటుకాదురా! పట్టు పట్టురా.

(దొంగలు దోఁచుకొన యోగిని సమీపింతురు.)

దుర్గా—(దండెములో గుప్తపఱిచిన కత్తిదీసి త్రిప్పుచు) ఓయుమ్మఁరతస్కరులారా! పంచ. దురాత్ములార! రండు మిమ్ముఁదునిమి పుత్తెలూడ్చి, త

[illegible]

గ్రుంగనంగఁ జోరణంబుఁ గూర్చువాఁడ, నిఁక మీ
దురంబుఁ జూపి కాచికొందు దోర్బలంబు గల్గినన్. 14

దొంగలు—బాబో రక్షించండి. (అని కాళ్ళమైఁబడుదురు.)

దుర్గా—ఓ పాముఁబోతులారా! మీధైర్య మింతలోనె పోవా? నే నడిగినప్రశ్నలకు సదుత్తరంబు లిండు; మిమ్ము రక్షించెదను.

దొంగలు—సిత్తంబాబూ-సిత్తం-ఏలాగైనా యీసుప్పుఁ దప్పించి తప్పుచమించండి బాబయ్యా.

దుర్గా—ఓరీ! నీవు వీరికిఁ బెద్దవా? ఇంకాఁక రాజసింహుఁ డిక్కాడికలోఁ దిరుగుచున్నాఁడంటివే. అది నీకెట్లు తెలిసె?

పెద్దోడు—బాబ్ మీపాదాలాన. ఇక్కడి సంగతులన్నీ నాకిల్లెప్పటి కప్పుడు ఆచోకి యిస్తూవుంటారు.

దుర్గా—సరియే. వీఁడెవ్వఁ డింకాఁ కజస్వంతసింహకుమారునకు విషప్రయోగముఁ జేయఁ బూనుచు ప్రయత్నించుచున్నట్లు వార్తవచ్చె!

రెం-మూ—అది మాకు తెల్దుబాబూ! అది మాకు తెల్దు.

దుర్గా—ఛీ. దాఁచక చెప్పుము- చూచితివా నాకరవాలము?

పెద్దోడు—ఈమనిస్య మంచోడు: తెల్సిందినా సక చెప్పుకొట్టా బతుకుంటేము.

మూ-వా—బాబో. నే నీయాకపారంపొంత నొక కొండగవిలో యిద్దఱు తురకోళ్ళే కొంత మాటాడుకొనుచుండగా యిన్నాను.

దుర్గా—సరే; మాకు మీరు భక్తులకై యుండుకని బాసచేయుఁడు. మీకభయంబొసంగెదను.

దొంగలు—సిత్తం. (అని పాదములఁబట్టి ప్రమాణముఁ జేయుదురు.)

దుర్గా—మీ మిఁక పొండు నమ్మివారము. ఓరీ! నీవు రూపనగరంబునకుం బోయి విశేషములం గొనితెమ్ము. ఓరీ! వెంబోడా! నీవు సౌరాష్ట్రపురంబునంగల వింత లారసి రమ్ము. ఓరి పిచ్చోడా! ఉదయపురంబునకుం జని రాణావారి కోటలోని వింతసంగతుల నెఱింగిరమ్ము. పొండు. మీరు రూపనగర భైరవ్యాలకు 17
మాకై వేచియుండుఁడు. (దొంగలు నిష్క్రమింతురు.) ...

ఈదొంగలనాయకుఁ డీమాటువికుల కేమిగడయని తోఁచుచున్నయ
కులగు వీరు బత్తి కుదిరిఁ గుత్తుకల నుత్తరించియైన నిత్తురు. ఇప్పు
సత్యమన్నది యున్నచో నది యమాయికులగు నాటవికుల యొ

యగ్రజన్ములమని విఱ్ఱవీగునాగరిక శిఖామణులలోఁ జాలమందికి ని సత్యమునకును స్వర్గమర్త్యలోకముల కున్నంతదూరము. అయ్యో! సత్యదేవతా!

సీ. వెలయాలిమొంగిలి పెదవులంటినపళ్ళ
కడనుండ నొల్లక నెఱలినావొ!
కూటికి నాశించి కూటసాక్ష్యము లిచ్చు
నోటిలోనుండక దాఁటినావొ!
బలితంపు గలుకంపు పలువిప్పఁగనె గుప్పు
మన భరింపఁగలేక యఱిగినావొ!
పొగచుట్టకంపు సైపఁగలేక పగబూని
ప్రాణముల్ తీపని పాఱినావొ!
సత్యదేవత! నిన్నన జాలిపుట్టు;
భరతఖండాన వేనవేల్ ప్రజలు లేరె?
బ్రాహ్మణులజిహ్వలన్నియు బాముపడెనె?
నీకు నివసింప నెక్కడ నెలవు లేదె? 15

ఇప్పుడీనీతులఁ గాలకుకాము. కూరిసత్యశరణ్యుడగు మహారణ్యము దాఁటి యిప్పుడొక పురపరిసరముకడ వచ్చినట్లున్నది ఆహా! ఈప్రాంతములయందిలత స్వల్పకాలములో నెంత వింతమార్పులు కానంబడుచున్నవి.

సీ. అనుపమానదయాబ్ధి యైన యక్బరువైద్య
శాలలా యివి వధ్యశాలలయ్యొ
బాటసారులకిరు బావఁ గట్టిన చల్వ
పాకలా యివి కల్లుపాకలయ్యొ
మొ:
దారిబోయెడువారు నీరముల్ గ్రోలెడి
దుర్గా— గుంటలా యివి పీగ్గువెంటలయ్యొ
పంచ. చిరపాయముగ నర్ధనిశిఁ జనందగు బండి
దారులా యివి మహామారులయ్యొ

పసులఁ గసి మసంగు కాసాయివాండ్రవలన
శక్తిఁబూజించు పాషండచయమువలన
గొంతుముడి నొక్కి చంపు తగ్గులకతమున
ముల్లెలఁదోఁచు తెరువాట్ల మూఁకవలన. 16

అప్పుడే సాయంకాలము కావచ్చినది. సత్వరంబుగ రూపనగరభైరవాలయం బుఁ జేరుకొనవలయును. భగవదనుగ్రహంబున నెట్లయిన నుదయపురోదయగిరి నుదయిం చిన ప్రచండభాస్కరుని రాజసింహుని దర్శనము లభించిన మమ్మాదరించియున్న యవనతమసరాసులు నిముసమాత్రములో నశింపక యుండునా ?................ సాయంసమయమున నీప్రాంతమందలి యీసందడి యప్పుడే యూరిపొలిమేరం జేరు కొంటి నని చెప్పకయ చెప్పుచున్నది.

సీ. ప్రక్క లుబ్బగ లేతపచ్చికఁ దినులేళ్ళ
గము లుల్కిపడు చిఱుగంటల సడి,
చిఱుగంటసందడు ల్చెవుల పండుగం జేయ
సందెమల్లెడు నాలమంద కదుపు,
ఆలమందకదుపు దోలుకొనుచువచ్చు
వేళఁ బాడెదు గోపబాలకులును,
గోపబాలకులు చేల్గాపుఁడ వందించి
వెన్నల దొంగిలు పిట్టగములు,
పిట్టగములు వెన్నల నోటబట్టి కందు
వుల కడ న్నిండ బారుబారులను దీర్చి
గూళ్ళకుం గొలకొలమని వళ్ళుచుంట,
పొద్దుగ్రుంకిన జాడల పొలుపుఁ దెలుపు. 17

కావున త్వరితముగఁ బోవలయును.

(నిష్క్రమించును.)



## 2 రంగము:—రూపనగరప్రాంతకాంతారము.

[విమలయు, తత్సహోదరియగు కేసరియు, వారిచెలులగు
మంజరీచంద్రభాగలును ప్రవేశింతురు.]

కేసరి—చెలీ! విమలా! ఈకొలనికెలంకులంగల యీచిఱుపడవల యాందోళనము తిలకించితివే?

ఉ. గట్టున నున్న చెట్లులకుఁ గట్టుటచే గిఱిదాఁటి యింక దా
మెట్టులఁ బోవలేకునికి నీదెస కాదెస కూఁగులాడు నీ
చిట్టికలంబు లంతిపురిసీమల దాఁటి గవాక్షమార్గముల్
చుట్టెడిరాణివాసముల చూపులపోలికఁ జెంగలించెడున్. 18

విమల—సోదరీ! కేసరీ! ఇది నీకు నత్తింట ననుదినము ననుభవసిద్ధమేగదా?

కేసరీ—విమలా! ఎవరికిమాత్ర మనుభవసిద్ధము గాదు?

మంజరి—(కమలాకరముచేతితోఁ జూపుచు) ఈప్రసంగమున కేమిగాని యీకమలాకర సౌందర్యము కనుఁగొందము రండు. (పరికించి మఱి) చూచితిరా మిళిందుని సందడి!

విమల—అవునవును. విడివడిన ప్రాఁతకు పడవెక్కి నౌకాయాత్ర చేయుచున్నాఁడు.

చ. పడతి! మిళిందనాయకుఁడగు పశ్చిమదేశపువర్తకుం డదే
వడివడిఁ దమ్మిరేకు పడవన్ మధుకోశపరాగవస్తువుల్
జడిగొని నింపి తెక్క తెరచాపల విప్పి సమీరనావికుం
డుడుగక యోడనడ్పఁ జనుచుండును చూడుము నావయాత్రకై.

మంజరి—విమలా! నీయుపమాన మతిసమంజసము.

కేసరి—నెచ్చెలులారా! మన మీయారామరామణీయకం గని మైమఱచి పురంబు వెడలి కడుదవ్వు వచ్చినట్లున్నది!

మంజరి—అమ్మా! చాలదూరమే వచ్చితిమి.

విమల—నెచ్చెలులారా! అబలలమగు మన మిట్లు విచ్చలవిడి విహరించుట మసలిన నెటునుండి యెటువచ్చునో? కాలము బాగుగానున్నది కాదు.

కేసరి—ఓసి బేలా! విమలా! నీవెంతభీరురాలవే. సమస్తయవనమండలచండశాసనుండగు నలంఘీయపాదుషాకుఁ బట్టమహిషినైన నేను నీకండయుండఁ నిన్నెట్టిగుం పగీఁడైనఁ గన్నెత్తి చూడఁగలఁడే?

విమల—అక్కా! క్షమింపుము. నీయందనుండుటచే నాకు మఱింత—

కేసరి—విమలా! ఏమినీమాట లేట! మాటకారినని నోటికివచ్చినట్లెల్ల సూటిమాటలు వదరుచున్నావు. ఇదియేనా నీవు పెద్దలయెడఁ జూపఁదగు గౌరవము? కూపస్థమండూకమువలె నంతిపురం బెడఁబాయకయుండు నీకు మర్యాదల తీరులును, నాగరికత రీతులు నేమి తెలియును?

విమల—నత్తగుల్లలోని నత్తవలె నత్తవారింట క్రొత్తఘోషాపద్ధతి నత్తియుండు మత్తకాశినులకుఁగాని నాగరికత మాకెక్కడిది?

కేసరి—విమలా! చిన్ననోటికిఁ బెద్దమాఁత లనునట్లు నోటికివచ్చినట్లెల్లవదరి నన్నురేఁపకుము.

మంజరి—విమలా! చిన్నతనముచేఁ దెలివితక్కువమాటలాడి యక్కయ్యగారి మనసు నొప్పింపం బ్రయత్నింపకుము.

కేసరి—మంజరీ! దాని కీదురుసు నేఁడు పుట్టినది కాదు. కావుననే దీని సరకుసేయను.

మంజరి—అదియేకదా మీబోఁటి యుదారవంతుల కుచితధర్మము.

కేసరి—మంజరీ! ఇంక నెంతయో వేళ కాలేదు. మన మా కాసారతీరముంజేరి కొంతతడవాటపాటల వినోదించి, పిమ్మట జలక్రీడల నోలలాడి, మఱియుం బోదము.

మంజరి—చిత్తము. అలాగుననే. ఏయాటలాడి వినోదింతము?

కేసరి—ఒక క్రొత్తయాట. రాజు రాణి యాట.

చంద్రి—రాణి యెవ్వరు?

కేసరి—రాణి విమల.

చంద్రి—మఱి రాజో?

కేసరి—రాజుమాట కేమిలే. మనలో నెవ్వరో యొకరు కావచ్చును.

విమల—నే నీయాటాడను.

కేసరి—ఆడక తప్పదు.

విమల—తప్పక బలిమిని మెడ ముప్పెదరా యేమి?

కేసరి—ఆడినం దప్పేమి? దానివలన ముప్పేమి?

విమల—అహో! ఒహో! నామనస్సొప్పనిపని నేఁ జేయను.

మంజరి—పోనీ. జలక్రీడలో?

విమల—సరే.

(అందఱు నడచుచుండ విమల కొలనిదెసఁ గనంగల పూదోటఁ జూచి) సుంద

చెలులారా! ఈతోఁట యెంత యందముగా నున్నదో చూచితిరా? ఈపూఁదోఁట కేరాజపుత్త్రికాప్రమదావనములోని పుష్పవాటిక యైన సాటిరాఁగలదే?

కేసరి—చెట్టు మొగ్గ మెఱుంగనివానికాముదపుఁజెట్టే మహావృక్షమంట.

ఆ. వె. చీకుమ్రాకుమ్రాఁక కాకరం బగుచు, చీ
కాకుఁ గొల్పు మోటుకాననుగని
సాటిలేని పూవుఁదోఁటయటందు వే
రాచబిడ్డతోఁటఁ జూదినావు? 20

మాకోఁటలోని మేటిపూఁదోఁటలం జూచిన నేమనుకొందువో?

విమల—ఎప్పుడును నాయభిప్రాయము మాఱదు.

చ. పలుకు లిఁకేల? వేలు వనపాలకు లెప్పుడుఁ బెంచుచున్న ని
ర్మలజలయంత్రము ల్జలము మాటికిమాటికి నింపుచున్న నీ
వలఁకున నీశ్వరుండు వనపాలకుఁడై తను బెంచుచున్న యీ
కొలని కెలంకుతోఁట కిలఁ గోటలతోఁటలు సాటివచ్చునే? 21

కేసరి—మంజరీ! నీ వొకపరి నాతో ఢిల్లీకి వచ్చినప్పుడు రాజనానామందిరమును, దానిప్రాకారమును జూచితివికదా? అచ్చట చిత్రవిచిత్రములగు జలయంత్రచిత్రములును, అతిస్వచ్ఛమగు చంద్రకాంతశిలావేదికలును, నేయేల, అచ్చట నున్న పలురకముల పూలమొక్కలును, యీభూమండలమందెచ్చటనైనఁ గలవే?

విమల—ఎన్ని వన్నె చిన్నె లెరువుదెచ్చుకున్న నేమి? నైసర్గికపు విన్నాణమునకుఁ దీసికట్టే.

చ. చెలువగు లేఁజిగుళ్ళు నగిషీపనిఁ గోరునె? అకుచిల్కఱె
క్కలపయిఁ జిత్రలేఖనము గావలెనే? హరివిల్లునందు వం
కలు సరిదిద్ది రంగులిడఁ గార్యమె? పూచినమాలతి న్మణుల్
వలయునె? నైజరమ్యమగు వస్తువు వేఱు విభూషఁ గోరునే? 22

మంజరి—అవును. చిన్నదైనను విమల చక్కఁగాఁ జెప్పినది. ఆవల వేళమించును. సత్వరంబుగ జలక్రీడకుఁ బోవుదము రండు.

(నిష్క్రమింతురు.)

[అంత మాఱువేషమున నుదయపురపు రాణాయగు
రాజసింహుఁడు ప్రవేశించును.]

రాజసిం— నే నుదయపురంబు విడచి, అప్పుడే మూఁడుదినంబులైనది అచ్చటి రాజకీయ వ్యవహారము లెట్లున్నవో! నాపంచప్రాణంబులు నా చిన్నిమేనల్లునిపై నుంచి వచ్చితిని. మాయక్క యోధపురేశ్వరి కిదివఱకు సంభవించిన యాపదకుం దోడు మహోపద్రవ మేదియో రానున్నది కాఁబోలు. లేకున్న తనముద్దుపట్టిని నా యొద్ద కేల పుత్తెంచును? కానిమ్ము. ఆపదలు నాపురముండవు…………… అబ్బా! సూర్యతాపం బతితీవ్రముగా నుండుటచే దాహబాధ మిక్కుటముగా నున్నది.

చ. అదె సుడిగాడ్పు లియ్యెడ భయంకరమై చదలంట రేఁగె; ఇ
ల్లిదె మృగతృష్ణల న్గనుచు నేగుమృగావళి నీటిభ్రాంతిచే;
పెదవుల నాల్కలన్ నరగ పెల్లుగఁ గార్చుచు లేళ్లు నీడలన్;
కదలమి పిట్టయేని వడగాడ్పులు తగ్గవు ప్రొద్దు వ్రాలినన్. 23

……………………………………………అదిగో. ఆకసమున శరత్కాలమేఘంపుఁ దునుకలో యనునట్లు బారుబారులుఁగా నెగడు కొంగలసమూహము ముంగల నొకసరోవర మున్నట్లు తెలియఁజేయుచున్నది. కావున దీనిజాడ నేపోయెదను. ఆహా! ఏమి యీశీతలవాతపోతంబుల మహిమ ఈమందమారుత మీ సరోవరరాజంబు మీదనుండియే వచ్చుచుండనోపు.

ఉ. శీతలవారిపూరసరసింగల తియ్యని నీరు గ్రోలి, యొం
తోతమి పద్మినీచయమనోజ్ఞసుగంధము లాని, యానసం
జాతగురుశ్రమ న్నడకచందము మందగిలంగ సుక్కి, యీ
శీతలవాతపాంథుఁ డిటఁ జేరెఁ బథశ్రమ వాయ హాయిగాన్. 24

నే నిదె యీసరోవరముం జేరి నీరము గ్రోలివచ్చెద.

(కొంతదవ్వు నడచి వెనుకకుఁ దగ్గి) ఇం దెవ్వరో జవ్వనులు జలక్రీడలాడుచున్నట్లున్నదే- ఇటుచనుట భావ్యము కాదు. ఈ చెఱువుక్రింది పూఁదోటలోని జలయంత్రమునకుఁ బోయి దప్పి దీర్చుకొనియెద. (పోయి) అక్కటా! దీనియందు జలమున్నట్లు కనఁబడదు. పోనిమ్ము. చల్లని యీమామిడికున్న తిన్నెపయి నించుక తడవు విశ్రమింతును. (అని పరుండును)

[విమలయు మంజరియుఁ దామరపువొన్నెలతోఁ బ్రవేశింతురు.]

విమల—చెచ్చెలీ! మంజరీ! కేసరి జలక్రీడ లింకను ముగించలేదా ?

మంజరి—లేదు. నేఁడు కేసరి కుంజరి యయినది.

విమల—ఇదేమే? నీమాట నాకర్థము కాలేదు.

మంజరి—అమ్మా! మరేమియు లేదు. సరోవరంబునఁగల తామరపువ్వులు కోసికోసి తనివి జెందక నేఁడు మనకేసరి వానిమాలికట్టి కుంజరియైన దంట్రిని.

విమల—ఇదియా నీభావము. కేసరివచ్చుదనుక మన మాకేళీవనంబున వేచియుందము రమ్మా. (రాజసింహుఁడు పరుండు చెట్టునీడ సమీపించి) చెలీ! ఈమంజుల నికుంజపుంజముల సందునుండి యాగుజ్జుమామిడికున్న తిన్నె వంకఁ జూడుము.

మంజరి—(చూచి) అమ్మా! ఎవరో పురుషులు విశ్రమించినట్లున్నది.

విమల—ఆజగన్మోహనమూర్తి యెవ్వరైయుండునే ?

మంజరి—ఎవ్వరోగాని యీవయసుకాఁడెంత యందముగా నున్నాడమ్మా! అమ్మా . ఇటు రావమ్మా. చూచెదవుగాని.

విమల—మంజరీ! మనము పురుషులం జేరఁదరాదు. పాప మీతండు ప్రయాణంపు బడలికచేఁ గడు బడలియున్నట్లు కానఁబడుచున్నాఁడు. ఈతం డెవ్వఁడై యుండునో ?

మంజ—నేను వీని నిదివఱ కెన్నఁడును జూచియుండలేదు. కాని యొకవేళ నుదయపురపురాణావారగు రాజసింహుఁడు నిన్నుఁ జూడఁ బ్రచ్ఛన్న—

విమల—చాలు. నీపరిహాసములు. నీతో మాటలాడుటకే భయము. ఎక్కసక్కెముల కారంభింతువు.

మంజరి—చెచ్చెలీ! హాస్యముకాదు ఇప్పు డీప్రాంతమువందు పల్లరల నాపివేయు రాణావారు స్వయముగ మాఱువేసమునఁ దిరుగుచుండిరను కింవదంతి కలదు.

విమల—మంజరీ! నీ వెంతమాయలమారివే. దానికేమిగాని కేసరి యింకను రాలేదు. సత్వరంబుగఁ బురంబుఁ జేరవలయుఁగదా?

మంజరి—అయిన నేఁబోయి తొందరపెట్టి కేసరిం దోడ్కొని వత్తును. నీ విందే యుండుము.

విమల—అమ్మయ్యో! నీవు వచ్చుదనుక నేనొంటిగా నిట నుండఁగలనా?

మంజరి—అమ్మచెల్లా! ఎంత భీరురాలవే ? నిమిషమాత్రములో వచ్చెద నాగుము.

(నిష్క్రమించును.)

విమల—(తనలో) గాఢనిద్రాప్రసక్తుండగు నీసుకుమారసుందరాకారుం డెవ్వఁడు? నిద్రావస్థయందుఁ గూడ నీసుందరాకారుని యందమెంత యానందజనకముగ నున్నది! ఈతనితీరు జూడ నెవరో రాజకుమారుఁడు గాని సామాన్యుఁడగు బాటసారి కాఁడని తోఁచుచున్నయది. ఏలఁ జన—

చ. ముకుళితమైనకన్గవ యపూర్వవిలాసము గూర్చు మోముద
మ్మికి, చిఱుచెమ్మటల్ మునుకమీఁదను ముత్తెపుపల్లుతోఁచు, మూ
ర్తికి వశీవశ్యు [illegible] దెలుపు; న్మోయిచాయ [illegible]
[illegible]కరణిఁ గందిన [illegible] డాఁపక తెల్పును సౌకుమార్యతన్. 25

ఒకవేళ మంజరి వినిన కింవదంతి నిజమై—

బాటసారి—(కదలి) ఆహా!

విమల—ఈతం డేదియో మాటలాడుచున్నట్లున్నది!

బాట—ఆహా! ఈదాహబాధ భరింపశక్యము గాకున్నది. అక్కటా! దాహము! తాపము! దుర్భరము! దుర్భరము!

విమ—అయ్యో! ఈ యువకుఁడు మిగులదప్పిఁగొని కడుబడలి సొమ్మసిల్లియున్నట్లు తోఁచెడిని. పోయి పానీయ మొసంగిరం దప్పేమి. (అని తామరదొన్నెలోని నీరిచ్చి దూరమున నిలిచి) మంజరి చెప్పినట్లా నేల నితఁడే, యువకపురీశ్వరుఁ డేమో! అయిననేమి?

రాజ—(జలముఁ గ్రోలి, సేదదేఱి)

గీ. మును సుధారసమును జగన్మోహిని సుర
వరులకు నొసంగి మృత్యువుఁ బాపినట్లు
శీతలజలాన నన్ను బునర్జీవుఁ జేసి;
యీజగన్మోహినీదేవి యెవరొ చెపుమా? 26

విమల—(మోమువాంచి యొకపార్శ్వమున నిలుచుండును.)

రాజ—ఇప్పుడే జలక్రీడ చాలించివచ్చిన యీనవలాశిరోమణి నవలావణ్య మెంతమనోహరముగా నున్నది.

చ. అరవిరి జాఱు వేణిముడి, ఆ ముడిమీఁద సమర్చినట్టి క్రొ
వ్విరి, నిటాలంబుఁ జుట్టి యుదవీములకుం దిగి రేఁగుముంగురుల్
కరఁగిన పూఁతమేని నిజకాంతినిఁ దెల్లము సేయ, యిప్పుడే
తరుణి జలంబులాడి సరిగా దాననిఁ జేసినట్లు చెప్పెడిన్. 27

విమల—ఆహా! ఈసుకుమార సుందరాకారునిం గనినది మొదలు నాయెద కుదురు పడక యొకవిధమగు వికారమునకు లోనైనది. ఈతని శరీరలావణ్యమనోహరతయును వ్రేలిశిఖాంగుళీయకమును మహారాజాయని తెల్లము చేయుచున్నవి.

రాజ—ఈరమణీశిరోమణిరూపుం గాంచఁ గన్యకామణివలెఁ గాన్పించుచున్నది ఈమె నీకరణి నన్యాపదేశముగాఁ బలుకరించి చూచెదను.

చ. ఇనుఁ డదె పజ్జనే కలుగఁ నేటికి మోమటువంచినావు ప
ద్మిని! మొగమెత్త లోఁగలతీరువితేనెల్ల నానునో యినుం
డనియెడు భీతిచేఁ గనుమొయ్యారముగా నటుఁ ద్రిప్పినావొ! లే
క నృపమరాళ మేచి యొడికంబుగఁ బట్టు నటంచు వంచితో? 28

విమల—ఏమి యీమనోహరవాక్చాతుర్యము! పద్మినియనుమిషచే నన్నే సంబోధించి 'ఇన, నృప' శబ్దముల ప్రభుండవనియు, రాజువనియు సూచించె. కాన నిఁక సంశయింపఁబనిలేదు. నేను నన్యాపదేశంబుగానే బల్కెద.

ఆ. వె. రాజహంస! నీవు రాణివాసమనస్స
రోవరంబు డాయుఁ బోవు దిపుడె;
నెమ్మి నచటి పద్మినీచయమ్ముఁ గని
యమ్మ మానసమున మఱతువేమొ ? 29

రాజ—ఈబాల యెంతమాట నేర్పరి! సరోవరమునందలి పద్మిని రాజహంసను హెచ్చరించు నెపమ్మున నాతోఁ దా ముచ్చటించుచున్నది. ఈమత్తకాశిని వచోక్తుల కనుగుణంబుగనే ప్రత్యుత్తర మియ్యవలెను. ఓపద్మినీకాంతా! నీ వెంత జేలవు!

ఆ. వె. మానసమునఁ గాదు మందాకినినె లేదు
నీకు మాఱు పద్మినీకుమారి
పరమహంస నేని మరులుకొల్పెడిదాని
మఱచిపోవు టెట్లు మానసమున. 30

విమల—ఆహా! ఏమి యీమనోహరవాక్చాతుర్యము. పలికించినకొలఁదిఁ బులకండము లొలికించుచున్నది. ఓరాజహంసమా!

మంజరి—(తెఱలోనుండి) నెచ్చెలీ! విమల! అశ్వముల నాయత్తముచేసితిని. సత్వరమ్ముగ రమ్ము.

విమల—(తనలో) అయ్యో! నాలిముచ్చటతె నీనెచ్చెలి యింతలో నెచ్చటనుండి

వచ్చినది. (ప్రకాశముగా) మంజరీ! ఇదిగో వచ్చుచున్నాను. కూఁత వేటుదూరంబుననున్న మనరూపనగరంబుఁ జేర నింతతొందరయేల?

రాజ—ఈచక్కెరబొమ్మ నన్ను విడిచిపోవుంగాఁబోలు. ఈమావికొమ్మతో నొకచిలుక తెలుపునెపమ్మున నాకృతజ్ఞత నీమెకుఁ దెలిపెదను.

గీ. ఎండవడి కడుబడలి నీయండఁ జేరు
కొని సుఖంచె నీరాచిల్కకొదమవచ్చి
భాగ్యవశమున నీప్రాపుఁ బడసి బ్రతికె;
అమితఫలసిద్ధి నీకగు నలరుఁగొమ్మ! 31

విమల—(తనలో) హాయి! హాయి! ఎంతచతురత!

ఓరాజకీరమా!

గీ. పలుకుపలుకునఁ దేనియల్ చిలుకుచుండఁ
గులుకు చెలువంబు మురిపెంబుఁ గురియుచుండ
వలచివచ్చిన మేటిరాచిలుకకొదమఁ
గూడు తఱిగాదె ఫలసిద్ధి కొమ్మకెందు. 32

మావిగున్నతిన్నెపైనున్న యోరాజకీరమా! నిన్ను విడిచిపోఁజాల. అయినను నెచ్చెలులు వేచియుండుటచేఁ బోకతప్పదు. సెలవొసంగుదేని పోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

రాజ—అయ్యో! ఈసుందరి యిచ్చోటివాసె. బాపురే! ఈరూపవతి సురూపసంపద, సురూప సంపద నిరసించు నీజవరాలి భావప్రకటనచతురత, ఈమచ్చకంటి యిచ్చటినుండి పోయినను నామె రూపముమాత్రము నాహృదయమునచ్చొత్తినట్టున్నది.

చ. జిలిబిలి పైటకొంగు కొనచేతను జట్టుచు మోముగోము కే
వల మగుపించునోయనుచుఁ బ్రక్కగ మోమొకయింతవంచి గు
బ్బలపొగ రంశుకంబు వలెవాటున నీటుగ మాటి యోర
చూపులనెడి వాఁడితూపులను బుచ్చి హరించెను నామనోధృతిన్.

అయిన నీమెదర్శనము మఱల లభించుటెట్లు! లభింపకేమి? తనపురం బనతిదూరముననే కలదని నెచ్చెలితోఁ దెలుపు నెపమున నీగరిత నుడివెనుగదా? నేను నచ్చటికే పోయెద.

(నిష్క్రమించును.)

శ్రీ

# రసపుత్రవిజయము.

## ద్వితీయాంకము.



### I రంగము:—రూపనగరములో నొకవీథి.

[పూలసెజ్జ చేతఁబట్టుకొని విమల చెలికత్తెయగు మంజరి ప్రవేశించును.]

మంజరి—అయినను కేసరీబాయి కింత కార్పణ్యము తగదు. తాఁజెడ్డకోతి వనమెల్లఁ జెఱిచినదన్నట్లు తా కులభ్రష్టయైనది చాలక హైమవతీపదారవిందసేవాతత్పరయగు సహోదరిం గూడఁ జెఱుపఁ గంకణముఁ గట్టుకొనినది. వీరిలో నెవరిప్రతిజ్ఞ సాగునో కదా! సహోదరీమాత్సర్య మింతయని సరకుచేయక విమలయు నిర్మలమానసయై కాత్యాయనీదేవిపదకమలంబు లేమరక గొల్చుచున్నయది. ఆశంకరార్ధశరీరిణి భక్తజనవశీకరిణిగదా?

[అంత హితదాసుఁడను నొకవృద్ధకంచుకి ప్రవేశించును.]

హిత—ఓసీ! మందరా! ఏమే నీకింతతొందర? కొలువు చాలించినంతమాత్రనే నీ కింతపలుచనైతినే? పిలిచిన వినిపించుకొనకున్నావు. నిజమునకు నిన్నుఁ గవలసిన పనియేమి?

గీ. తనకు నుద్యోగముండిన తరుణమందెఁ
బిలువ కరుదెంత్రు వేనవేల్పులు సేయు;
నున్నయది యూడ, పిలిచిన నొకఁడు రాఁడు;
ఇదికదా లోకధర్మ మీపృథ్విలోన. 34

మంజరి—తాతా! నీచీఁకుందనపుఁజీకాకు నాపైఁ జూపకుము. నేను మందరను కాను. దానిసహచరినగు మంజరిని.

హిత—ఓసీ! నీవు మంజరివా? పోలికనుబట్టి మందర వనుకొంటిని.

మంజరి—ఇది మాపోలికలలోపము కాదు. ముదిమిచేఁ బోలికపట్టలేని నీలోపమే.

హిత—అడిగో నాముదిమి నాక్షేపించుచున్నావు. ఇంతకు నిన్నఁబనేమి?

ఉ. కన్నులు కానరావు; మఱి కాళ్ళు రవంతయు సాగ; వీనువుల్
తిన్నగ నేనినైన వినలేవు; కరంబులు పట్టుఁ దప్పు; వ
ళ్ళన్నియు నూఁగు; నింద్రియములన్నియు మించిన శత్రులౌనటన్
నిన్నన నేమి కార్యమగు నేరము నాయది యాపుదే కదా. ౩౫

పోనిమ్ము. ముసలితనముచే వారిఁబలె నడివయసుఁదనముచే నీకును నింద్రియములు స్వాధీనము గాకున్నవా యేమి? మాటాడ వినిపించుకొనవు. ఇంతదాఁక నేమట్లు గొణుగుకొనుచుంటివి?

మంజరి—ఏమియు లేదు. పడ్డగింజలోనిది బియ్యపుగింజ. తాతా! ఆఁడువారి యూసు నీకేల?

హిత—ఓసి తొత్తా! పసుపుదనపుగరువాన మిడిసిపడి గసుగుమాటలాడక సరిగా నుడువుము. అంతిపురమునందలి విశేషము లేమి?

మంజరి—తాతా! నీనోటిలో నువుగింజ దాగదు. నీ కీజోలియేల?

హిత—ఓసీ! వగలాడి! పొగరుపడక చప్పునఁ జెప్పుము.

మంజరి—(తనలో) తాతపట్టు కోఁతిపట్టు. ఇఁక వదలఁడు. (ప్రకాశముగా) తాతా! ఢిల్లీ పాదుషా పట్టమహిషియగు కేసరీబాయి నెఱుఁగుదువుకదా?

హిత—అయ్యో! ఎఱుఁగకేమి! ఆమె మనరాజుగారి పెద్దకూఁతురే. ఆమె వివాహమునకేగదా రాద్ధాంతసిద్ధాంతము లైనవి.

మంజరి—అదేమోగాని ఆవిడగారిప్పుడు పుట్టింటికి వచ్చినారు.

హిత—అయిన నేమి?

మంజరి—మనరాణావారి రెండవకూఁతురు విమల దేవీపూజచేసికొనుచుండఁగా, కేసరి పానకములోని పుడకవలె వచ్చి చెల్లెలిం బరిహాసించినది.

హిత—ఆ! ఏమి! ఆమెధనమదాంధత! తరువాత?

మంజరి—అక్కచెల్లెండ్రకంతఁ గొంతవఱకుఁ దమతమమతములఁగుఱించి వాదము జరిగినది. అంత, చెల్లె లుదాసీనయై తురకం గూడిన నిన్ను సరకుసేయ ననె.

హిత—అయ్యో! నిజమాడిన నిష్ఠురముకదా. పిమ్మట?

మంజరి—అంత, కేసరీబాయి కరిం గన్నిన కేసరివలెఁ జెల్లెలిపైఁ గనులెఱ్ఱఁజేసి, "ఓసీ! బుద్ధిహీనురాలా! నన్నెఱుంగక నోటికివచ్చిన ట్లెల్లఁ బ్రేలుచున్నావు. నిన్నొక మొఱకువలెనున్న తురకవానికిచ్చి పెండ్లిగావింపకున్న నేపాదుషాకుఁ బట్టమహిషినే గా" నని యొట్టుఁ బెట్టుకొనె.

హిత—కట్టా! గట్టియిక్కట్టే వచ్చినది. కేసరియనుపే రామెకే సరి, పైని—

మంజరి—పైనేక నేమున్నది. విమలయు బోమముడితోఁ గేసరిఁజూచి "ఓసీ! తుచ్ఛురాలా! పచ్చవంటి యచ్చపురాకులంబులకెల్ల మచ్చఁదెచ్చిపెట్టిన నీ మొగంబుఁ జూడరాదు. పౌరుష దేశాభిమానముల కునికిపట్టై నీమగనిగరువంబడగింపఁజాలు మేటిమగండగు రాపట్టిం జెట్టఁబట్టుకున్న నమరసింహుని ముద్దులపట్టినే కా"నని యొట్టుఁబెట్టుకొనె

హిత—వహవ్వా! మిక్కిలిచక్కగానున్నదే. తుద కెవరు గెలుతురో?

మంజరి—ఏమో "ధర్మమేజయ"మను నార్యోక్తియే నిజమైనయెడల మన విమలయే మేలుచేయి కావలెను.

హిత—అందులకుసందేహమేమి? కాని మన యుద్యానవనములో వేనవేలు పూలుండ నెక్కడినుండి, అపురూపముగా నీపువ్వుల నేతెకొని వచ్చుచున్నావు?

మంజరి—ఇవియా? భైరవీదేవాలయములోనివి. విమల వానింగొనితేర నన్నందులకంపె.

హిత—ఓహో! అట్టులా? అక్కడి కెవరో జడదారి వచ్చెనఁట. నీవు చూచితివా?

మంజరి—అయ్యో! చూడక పోవుటేమి. అతఁడు మహానుభావుఁడు; ఆగతానాగతవేది

హిత—అయిన మనవిమల నాతనికడకుం గొనిపోయి మంచిచెడ్డల నెఱుంగరాదో?

మంజరి—అవును. నాయుద్దేశము నదియే.

హిత—మంచిది. నీవీపనియం దప్రమత్తురాలవై యుండుము. నే నిఁకఁబోయెదను.

(నిష్క్రమింతురు.)

## 2 రంగము:—రూపనగర భైరవాలయము.

[యోగి (దుర్గాదాసు) సమాధియందుండ చారులు ప్రవేశింతురు.]

చారులు—రామ్. రామ్. (అని నమస్కరింతురు)

యోగి—(కనులువిప్పి)ఓచారులారా! ఏమేమి విశేషవార్తలం దెచ్చితిరి?

మొదటి—సామీ! జోదపురపురాణిగారు కోటలో నెక్కుచెదరకున్నారు. కాని తవనిన్నిపాప మేనమామగారియూరు నేరెనో లేదో యని యొక బాపనయ్యన్నందుఁ బంపించినారఁట.

యోగి—సరే. (రెండవవానితో) ఓరీ! చెండోడా! నీవుతెచ్చినవార్తలేమి?

రెండవ—ఏలికా! ఆకందయ్య కసుగందక ఉదయపురంబులో మామగారింటికాడున్నారు. కాని రాణావారుమాత్రి మిప్పుడు దేశంలో నేరఁట.

యోగి—(మూడవవానితో) ఓయి మృచ్ఛలకుఁడా! నీవు తెచ్చిన విశేషంబు లేమి?

పెద్దోడు—తలిసికుఁడా? నేను మాకాళ్ళకిందట ఈయూరిపాలి మేర చేరువచేరువ రాచకూఁతు రొకతె, ఒకవయసుకానితో మాటాడుచుండఁగా యిన్నాను. తరువాత పూళ్ళోకొచ్చి ఆసోకితీయఁగా రాజుగారికూఁతుళ్ళు పందెమాడుకొన్నట్లు దాసీ లూసులాడుకొనుచున్నారు.

యోగి—సరే. మీరందఱు నెప్పటియట్లు మీకు నియమించిన స్థలములయందలి వింతల నెప్పటికప్పుడు తెచ్చి మాకుఁ జెప్పుచుండవలయును. మీయందఱిలో మిక్కిలి జాగరూకుఁడగువాఁడు ఫకీరువేషమునఁ బోయి, ధాముసాజనానాలోని విశేషములఁ దీసికొని రావలయును. పొండు. జాగ్రత్త.

చారులు—సిత్తం. సిత్తం. (నిష్క్రమింతురు.)

[రాజసింహుఁడు ప్రవేశించును.]

రాజ—ఆజన్మోహిని ప్రథమసందర్శనంబున నే నామనోమందసంబునం గల నిలుకడ మొదలగు గుణధనంబులు హరించినది.

గీ. ఓరచూపుల నిలుకడ నోటుపఱచె;
మేని మెత్తనచే మది మెత్తఁబఱచె;
మందగిలఁ జేసె బుద్ధి తన్మందగతుల;
రూపు చెలువంబుచే ధృతి రూపుమాపె. 36

బాపురే! ఆయమ్మలమిన్న విన్నాణము నాకన్నులఁ గట్టినట్లున్నది.

ఉ. ఆమెలనాగరూప మహహా! కనుదమ్ములఁ గట్టినట్లు న
న్నాయ దదేమికారణమొ? పైదలిపైఁ దలఁకొత్తె చిత్తమో
హో! యెటుఁజూడ నెప్పుడు పయోధరవేణిసురూపమే, తరు
చ్ఛాయను శీతలోదక మొసంగినభంగియె కానవచ్చెడున్. 37

అబ్బా! అబ్బిబ్బోకవతిం గాంచు భాగ్య మబ్బుటెట్లు? ఈదేవళముం బ్రవేశించినంతనె కుడిభుజం బదరుచున్నయది. ఆ! యిందెవ్వారో జడదారి యున్నట్లున్నదే! ఆహా! యేమి! ఈయద్వితీయమూర్తివంతము!

సీ. గఱిడీలలో నిరంతరము దేఱినభంగి
భుజకంధరంబు లుప్పొంగియుండ,

అనిశంబు సాముచేసినవాని పోలిక
వెడదయై వక్షంబు బిగిసియుండ,
డాలుకత్తులు దాల్పఁజాలు జోదునిరీతిఁ
జేతివ్రేళులు మోటుఁ జెందియుండ,
అసహాయశూరుఁడౌ నాశ్వికవరులీలఁ
బిక్కలు బల్మి నేపెక్కియుండ,
సాటిలేనట్టి క్షాత్రతేజంబుతోడ
నివురు గప్పిన నిప్పనా నెగడు నితనిఁ
గాంచి సన్యాసి యని మది నెంచుటెట్లు?
ఔ! మహాత్ములఁ దెలియంగ నలవియగునె?

ఈతండెవ్వరో మహానుభావునివలె నున్నాఁడు—పోయి దర్శించుకొనియెదంగాక.

(సమీపించి నమస్కరించును.)

యోగి—ఇష్టసిద్ధిరస్తు. (తేఱిచూచి) ఓశూరాగ్రేసరా! ఇటు కూర్చుండుము. (తనలో) ఈతఁడు తప్పక రాజసింహుఁడే. పరిచారికమాటలకును చాయ లెఱింగించినదానికిని వీసమైన వాసిలేదు. (ప్రకాశముగా) ఓశూరాగ్రేసరా!

గీ. స్వీయ ధనధారఁ గురిసి, ఆశ్రితజనాళిఁ
దనుపఁ గంకణ మూనినఘనుఁడ వగుచు
నుదయపురవార్ధి నుదయించియున్న రాజ
సింహుఁడవు గావె? పరగజసింహా! నీవు.

రాజ—(తనలో) ఈమహానుభావుఁడు సామాన్యవేషమున నున్నను నన్నెట్లు గుర్తింపఁ గలిగె?

యోగి—ఓబాలకా! నీ వేల శంకించెదవు? ఇంక న్వినుము.

మ. తరుణీరత్న మొకండు మొన్న నిటఁ గాంతారంబులన్ జూడఁగా
నరుదెంచెన్, కనె, చెట్టునీడ నురుమూర్ఛాధీనునిన్ నిన్ను, ఆ
సరసీజానన మూర్ఛఁ దేర్చె ననువౌ శైత్యోపచారంబులన్
సరియే గాయిదియంత? ఆమెఁ గను నాస న్వచ్చినా వీడకున్.

రాజ—స్వామీ! ఇదియంతయు వాస్తవమే. నాఁడా మొలమావితిన్నెపై నాతో యవ్వలి తన కోమలకరపల్లవంబుల శీతలజలంబు లొసఁగి నన్ను రక్షించె. ఆ మించుబోఁణి దర్శనము మఱల నాకు లభించునా?

యోగి—ఓయీ! ఇంతమాత్రమేల? కొంచెము శాంతించితివేని, ఆమించుఁబోణిని మా మంత్రప్రభావమున నిచ్చటికే రప్పించెదము.

ఉ. శాంతముఁబూను మొక్కనిముసంబునఁ జూచెద వామె, కానియా
కాంతకు రాణివాస మటుగావున నీవగు రూపు డించి యొ
క్కింత తపస్వివేషము నటించుట యొప్పగు; నిట్లుచేయు నీ
స్వాంతమునందు వేఱుగతి సందియ మొందకు రాజచంద్రమా!

(అని తనకక్షపాలలోని దుస్తుల నొసంగ రాజసింహుఁడు లోనికరిగి ధరించివచ్చి కూర్చుండును.)

[విమలయు, మంజరియుఁ బ్రవేశింతురు]

విమల—చేటీ! అక్కడ నొకవృద్ధతాపసియు, నాతనిచక్కి నొకచక్కని బాలతాపసియుఁ గనఁబడుచున్నారు. వారేనా నీవుచెప్పిన మహానుభావులు?

మంజరి—సఖీ! ఈబాలతాపసి యెవ్వరో నే నెఱుఁగ; కాని ఆవృద్ధుఁడే త్రికాలవేది.

విమల—(తనలో) ఈకోమరుప్రాయంపుఁదపసి కేవలము వైరాగ్యావస్థ నొందుఁగూడఁ నెంత మనోహరముగానున్నాఁడు! (పైకి) చెలీ! మంజరీ! ఈబాలతాపసి సుకుమార సుందరాకారము వైరాగ్యవ్యాపారమున కించుకంతయుఁ దగియున్నది కాదు. ఏలయన?

సీ. లలితచందనచర్చలకు నర్హ మగుమేను
బూడిపూతలు గోరఁ బోలదుగద;
తులలేని పట్టువస్త్రములు గట్టఁదగుభోగి
జోగియై శాటి మైఁ జుట్టఁదగునె;
రమణీయతారహారములు దాల్చెడు మెడ
తులసిరుద్రాక్షపేరులకుఁ దగదు;
కరవాలమున శత్రుశిరజాలము లదల్చు
వ్రేళ్లజపమాలికల్ త్రిప్పఁజనదు;

రత్నఖచితకిరీటంబు రహిం ధరించు
మస్తక మవర్హ్వా మిట్లు చర్మము ధరింప;
హంసతూలికాతల్పమునం దలరు మేను
కఠినపాషాణవేదికం గమలం దగదు.

మంజరి — కోమలాంగీ! నీమానసముగూడ నవనీతకోమలముగదా! ఇదే ఈవకాని రాజులను సమీపించితిమి. మనోరథం బెటి గింతువు గాని రమ్ము.

విమల — మంజరీ! అదేమియోగాని వీరినిడాయ నాకు భయమగుచున్నదే.

మంజరి — మఱేమియులేదు. అతిసంతోషముచేతనే భయము. సత్వరంబుగ రమ్ము.

రాజు — ఈపుత్త్రం బోణి తప్పక నాం డామెలమావితిన్నెపై నేంగనుంగొన్న యన్నుల మిన్నయే. కృతస్నాతయై దేవతాదర్శనమునకుం గాంబోలిటువచ్చుచున్నది. ఆహా! ఇప్పుడీయచ్చకంటి చెలువ మెంత రాణించుచున్నది! మునువయుండుటచే వింజామరవలె వీపెల్లం గప్పి పిఱుందులవఱకుం జీరాడు సోదపెన్నెఱివేణి సోగయును, కూంకటిం జతపడక మోముదామరపై నుంగరంపుంజుట్టులనం గడు ముద్దుమూంటం గట్టు ముంగురుల సింగారమును గలిగి, యీమంగళాంగి శృంగార శృంగాటకమయి యెంత మనోహరముగా నున్నది!

సీ. మోము నంవము చందమామ చందముం గేసు
కందు లేకట్టి యాకారణమున;
చేతఃచూపులు మారువాండితూపుల మీఱు
గడియలో రాగంబు చెడనికతన;
మోవి ముంకెసపూపుకావి పొంక మడంచు
నమితమా తేనె లందమరియుంట;
కలికిపల్కులు చిల్కపల్కు చుల్కన జేయు
యుక్తియుక్తంబులై యొప్పుచుంట;
విరులవింటి మొఱుకు పరువంపు గోనాళ్ళ
కొంటకు నిడిన యురులు తెఱవకురులు
తొడలనంటిగెడలు నడు మనంగునొడలు
నడబెడంగు లంచనడ నడంచు.

అదిగో! ఆచక్కెరబొమ్మ యిక్కడకే వచ్చుచున్నది. ఏమి! యీతని మంత్రప్రభావము!

[విమలయు, మంజరియు వృద్ధతాపసిని సమీపించి వంగి మ్రొక్కుదురు]

వృ-తా—(చూడకయే కన్నులు మూసికొని జపము చేసికొనుచుండును.)

రాజ—ఆహా! ఈతనికి మ్రొక్కుతఱి నీసునూఁగి యుత్తమాంగం బెంత వర్ణనీయముగా నున్నది!

ఉ. భామ శిరంబు వాంచి యురుభక్తిని మౌనికి మ్రొక్కసాఁగఁగా
మోమునుగప్పి లేవ వెనుఁబొంగెడు వేడిదనర్చు షట్పద
స్తోమము లేమమోముఁ గని తోయజమంచు భ్రమించి వచ్చి వే
కోమలి నాసగంధఫలి గొబ్బునఁ జూచుమఁ బ్రాతెనో యనన్.

వృ-తా—(కనులువిప్పి) ఓహో! ఓపరిచారికా! మీ రాకుమారిం దీసికొని వచ్చితివా?

మంజరి—(విమలఁ జూచి) స్వామీ! ఇదే! ఈమెయే మా రాకుమారి! అసమయమున వచ్చితిమి కాఁబోలును పోవుదుమా!

విమల—చెచ్చెలీ! వీరు వారితో నంతరంబున నున్నారు కాఁబోలు.

వృ-తా—సోదరులారా! శంకింపకుఁడు. ఇప్పటికి విరాగులమగు మాకు మీరు వినరాని రహస్యములు లేవు. (బాలతాపసిం జూచి) ఈయన మామిత్రులు ఉద్ధయపురమందలి యొక జ్ఞాని పరమహంసకులోత్తంసులగు వీరియెడ మీకు సంశయింపఁ బనిలేదు. (బాలతాపసితో) ఆర్యా! వీరొక కార్యార్థమై వచ్చియుంటిరి. కటాక్షించి, వీరికి సందేహనివృత్తిఁ గావింపుము.

బా-తా—ఈతనిచర్యలతివిపరీతములుగా నున్నవి. నేనును బ్రస్తుతరూపమున కనురూపముగనే వర్తింపవలయును.

(మంజరియు, విమలయు నొండొరుల మొగంబులఁ జూచుకొనుచుందురు.)

వృ-తా—లలనా! సంశయింపక నీవామకర మామహానుభావునకుం జూపుము.

విమల—(సిగ్గుచే మోము వాంచి యూరకుండును)

మంజరి—(విమలచేతిని బలవంతముగ బాలతాపసి కందిచ్చును)

బా-తా—(తనలో) ఈకుసుమకోమలి కోమలకరపల్లవ మెంతమృదువుగానున్నది!

తే. గీ. చిగురుటాకుల మేల్జగజిగిని గెలిచి,
పసిఁడిబిసకాండముల పస మిసిమి నణఁచి,

అలరు చెలి వామకర మంటు టబ్బె నేఁడు;
ఇంతి దక్షిణపాణి గ్రహించు టెపుడొ!

(ప్రకాశముగా) కువిదా! పవిత్రచరిత్రయగు మీరాజపుత్రిచరిత్ర మాకుఁ గరతలామలకం బయ్యె. వినఁగోరుదు వేని వినిపించెద.

మంజరి—అంతకన్నఁ గావలసిన దేమున్నది!

విమల—(మెల్లగాఁ జేయి లాగుకొని బాలతాపసి చెప్పునది యాతురతతో వినుచుండును.)

బా-తా—క. వనితామణి వనితంతో
వనితలమునఁ దిరుగునెడను వనితరులదరిం
గనుగొనలం గనుఁగొనియెఁ
మన మలరఁగ నొకని గున్నమామిడిక్రిందన్.

అది మొదలు లీముదితహృదయ యొకవిధము మదనవికారమునకు లోనైనది.

విమల—(సిగ్గుచే దిగ్గునలేచి దూరముగాఁ జను.)

బృ-తా—ముగ్ధా! ఆప్తులగు మానిరాజులచెంత సిగ్గేల? పైసంగతినిఁగూడ వినుము.

ఉ. చెన్నగు చిన్నెలాఁడు, కడు చిన్నరి పొన్నరి వన్నెగాఁడు, పే
ర్యున్నలమిన్న యైన దగునన్న నిగారపుఁ జెన్నువాఁడు, ఆ
క్రొన్ననమేనివాఁడు, మదిఁగూర్చుచొకారపుటందకాఁడు, ఆ
పన్నుఁడు, రాచవాఁడు, ననుపాయపువాఁడు, కనంబడెం జుమీ.

ఆతనిఁ దన శీకలోదకదానంబున సేదఁదేర్చినతరువాత.

చ. సరసిజనేత్ర! యింతఁ దనసాగడికత్తియ తోడురాఁగ మం
దిరమును జేరి భక్తినెయి దేవి భవానినిఁ గొల్చుచుండ సో
దరి చనుదెంచి యీమెఁ గని గని తాఁ బరిహాసముఁ జేసె; అంత నీ
తరుణి ప్రతిజ్ఞఁ గైకొనియెఁ దప్పక రాజకుమారు కేల్గొనన్.

విమల—(మంజరితో మెల్లఁగ) నెచ్చెలీ! కడచినసంగతులేల?

మంజరి—స్వామీ! ఈపువ్వుఁబోణి తఁభావిఫలము నెఱుఁగఁగోరుచున్నది.

బృ-తా—మానినీమణీ! అనుమానింపకుము.

మానినీవృత్తము.

మానిని! నీదగుమానసముం దనుమానము( బూనకుమా; వినుమా
మానక యేనిమనోహరరూపము మానసమందున( బూనితివో
వానినె నీదగు పందెము( దీర్చును వానినె, రాజకుమారకునే
మానవతీ! వరియింతువు నీ వణుమాత్రము సందియ మొందకుమా.

మంజరి—తపోధనచంద్రమా! మా డెందంబున నీక నేమియు సందియంబు లేదు. కాని, ఆత( డెట్టి కులశీలసాంప్రదాయములు గలవా(డు? నామధేయమేమి?

వృ-తా—ఇందువదనా! సందియమేల? వినుము.

విమల—హృదయమా! సావధానవుగమ్ము మంజరి నీహృదయశల్య మూడ( బెఱికెడి.

వృ-తా—

చ. ఉదయపురప్రసూతు(డు, మహోజ్జ్వలరాజ్యసతీగృహీతు(, డా
విదళితశత్రుజాతు(, డుసువిక్రము(, డర్కకులప్రపూతు(, డా
సదమలకామినీమనసిజాతు(డు భారతరాజ్యరక్షణో
న్మదితమనస్సమేతు(, డలపూరుషసింహు(డు రాజసింహు(డే.

విమల—మంజరీ—ఇప్పు డాయన యెచ్చట నున్నవారో?

వృ-తా—ఆరాజశేఖరుండు, తనయం దనురాగముగల రాజస్థానధరాకాంత నిజసోదరీశిరోమణులవలె మ్లేచ్ఛహస్తగతం బగునేమో యని తదభిమానరక్షణోద్యోగంబున సర్వాంతర్యామియైన సర్వేశ్వరునికరణి సర్వదా పెక్కురూపంబుల సంచరించుచుండు. అట్టి యాపరోపకారపరాయణు( డిప్పుడు, ఇక్కడ, ఈరూపంబున నుండునని యెట్లు చెప్పనగు?

మంజరి—మహానుభావా! పోనిండు. ఇంక నెంతకాలములో నాసెచ్చెలి మనోరథంబు నీడేర(గలదు.

వృ-తా—కాలనిశ్చయముచేయ నవకాశములేదు. కాని కార్యము నిశ్చయము; తప్పదు

మంజరి—సెచ్చెలీ! నీవింక ధన్యురాలవు. వచ్చినపని పండెయినది. ఇంక సెలవు పుచ్చుకొందమా?

విమల—మంజరీ! ఆ(గుము. ఈపూమంజరి యీమునికుంజరునకు సమర్పించి వచ్చెద.

వృ-తా—రాజపుత్రీ! కేవలము లౌకికోచితంబులగు నిట్టి పసదనంబులతో మాకు( బని

యేమి ! భక్తియే చాలును. అయిన భక్తితో నిచ్చినది పుచ్చుకొనకుండుట పాడిగాదు. కాన దాని నాజ్ఞాని

విమల—(మెల్లగా బాలతాపసికి విరిబంతి నీయఁబోయి సిగ్గుచే మఱలి) మంజరీ ! ఆమునికుంజరున కీపూలమంజరి నొసంగుము.

బాలతా—మంజరీ ! మంజులగుణమంజరియగు నీకుంజరయాన తన కొంజిగురాకు చేతులతో నాపూలమంజరిఁ దానేల యీరాదు ?

మంజరి—ముగ్ధయగుటచే నునుసిగ్గు పెంపున నపరిచితపురుషులని వెనుదీయు.

బాలతా—ఓహో ! ఏమామౌగ్ధ్యము ! ఎంతసిగ్గరి !

గీ. నీరము నొసఁగి సరసనె నిలుచునాఁడు,
హంసయని పిల్చి సర్వోక్తు లాడునాఁడు,
కరము నందిచ్చి సోదెలు గఱచునాఁడు,
పురుషులము గామె ? యిప్పుడ పురుషులమఁటె ? 51

విమల—నెచ్చెలీ ! చేలలము మన మీకొడెంబిసి వేసగానిచే నిష్కారణముగా మోసపోతి మిఁక రమ్ము. (బాలతాపసిపై పూలబంతి విసరి చటాలునఁ బోవును.)

బాలతా—అబ్బా ! చెదరిన యీమదనశరకోటి నాహృదయపీఠి నెంతగాటముగా నాటినది !

ఆ. వె. దంతిగమన పూలబంతిని విసరంగఁ
జెదరి పూలు నాదు హృదయపీఠి
చెఱకువింటిజోదు గుటి నేసిన ఫిరంగి
గుండు చిట్లు రవలు నిండునట్లు. 52

(అంతటఁ గలయంజూచి) ఏదీ, ఆమందయాన ప్రైవీమందిరంబు దొలంగి చనెఁగాఁబోలు. అయ్యో ! ఎంతమంతభాగ్యుండను ! మందమతిం దొందరపడి, మంద రదనకుం దొందర గలిగించి, సుందరం దనరారు విందుం దూరంబుఁ జేసికొంటిని.

యోగి—రాజసింహా ! నీవిందులో నిస్సందేహముగా మందమతివైతివి. ముందరయక, తొందరపడి, బయలుపడి ముందరిపని కెంతయో గందరగోళముం దెచ్చిపెట్టితివి. కానిమ్ము; మించినదానింగూర్చి విచారించిన లాభములేదు. కర్తవ్యం బాలోచింపవలెను. రాజసింహా ! భ్రాజమానతేజోవిరాజమానుఁడగు నీరాజపుత్రి ప్రతిజ్ఞారంభంబు నీవిప్పుడు వినియుంటిగదా ? కాబట్టి నీవెట్టులయిన

నీ రాపట్టిం జేపట్టి తానేమో, ఘాసుపాకం బట్టభద్రుఁడవనిగదా యని మిట్టిపడుచు తోఁబుట్టువు దురకవానికిం గట్టిపెట్టఁ గంకణము గట్టుకొనిన దుష్టురాలిం గేసరిం బరాభవించి తీఱవలెను. అనిచురా బలంఘీయసను బురు లెక్కింపక మానదు.

రాజ—యోగివర్యా! అట్లయిన నాప్రతిజ్ఞ వినుఁడు.

క ఈనిర్మలమతిమానం, బేనోడక కాచువాఁడ నిఁక నేమైనన్ లేక
గానీ, రాజ్యము పోనీ; పూనితి నిదె ప్రతినఁ గత్తిముట్టి మహాత్మా!

యోగి—విరోధివేదండవీరసింహా! రాజసింహా! నీ వంతవాఁడ వే యగుదువు. కాని దీనికి ముందు చేయఁగలసిన పను లింకను గలవు

గీ. వడి నలంఘీయుగర్వంబుఁ బాపు టొకటి;
యోధపుర రాజ్యరక్షణోద్యోగ మొకటి;
నీకు మేనల్లు గద్దెపై నిలుపు టొకటి;
మించి యీ ప్రతిన తము జెల్లించు టొకటి. 51

దీని నెఱవేర్పు క్రియ లుపదేశింతును; రమ్ము. (నిష్క్రమింతురు)

3 రంగము:—కేసరిమందిరము ముంగలివసారా.

[గులామాలీ సారాయిబుడ్డి పట్టుకొని ప్రవేశించును.]

బలే! భేషూక్! ఎన్ని రోజులిక్క నాకీ పీనాకీ పక్కానిపాపానీ లేక నికు పీకాక్ అవుతూందిరా! అల్లా! పాదుషా మాపాణాల్మదికి యెంత ఘట్టిహుకుం జోకాయించినాడ్. బలే. బడేపాదుషా పాజహాన్ మహారాజ్ఞీ అమల్ పక్కా అమల్. ఇష్టో సైతాణ్ దీఅమల్. గానా బజానా పీనా కందామేఖానా మందిర్మెబిచానా లేక బందిఖానా కే మాఫక్ గుండె బేజార్ అయిపోతూన్నాది హుజూర్కే తాఖీద్ మంజూర్ సెయ్యాలీ! లేదూ?

(తుదిమాఱ్పుచేసి, ఏకతాళము పాటఁగా పాడవచ్చును.)

సీ. గానాబజానామె ఘుర్మేబనాయించి
కైపెక్కి కందాలో ఖాదవలెను (లెన్)

టూచెన్మోకం చెక్కి లంచాల్ ఫిరాయించి
మేజువాణీలతో మెలఁగవలెను (లెన్)
హాజూర్ బజారీమె మూజూమ్ బజాయించి
రోజు రోజునకును రోజవలెను (లెన్)
సాఖీన్ బిబీకిబల్ నీఖాసాసాయించి
పాకీర్లమూకను సాకవలెను (లెన్)
గీ బల్‌హుషారీసె చంద్రి చేపట్టవలెను (లెన్)
పై తమాషాగ దానితో బలుకవలెను (లెన్)
సబ్బరాబర్నిభోగాలు సల్పవలెను (లెన్)
హాయిరే హాయి హాయిరే హాయిహాయి. 55

[అంతఁ గేసరిదాసియగు చంద్రిభాగ ప్రవేశించును.]

చంద్రి—ఓరీ! గులాంషా. డా! ఏమిరా నాపేరెత్తుచున్నావు?

గులా—ఓసీ! చంద్రి! అవ్ నీకీ నిఖామె సెయ్యడానికి మాకీ ఉద్దేశం.

చంద్రి—ఓరీ! గులాం! ఈమారు నాపేరెత్తితివా పురా అంటే తప్పకుండా కేసరీబాయిగారితో చెప్పివేస్తాను.

గులా—ఓసీ! చెటాకిరీ! ఇలారాయే! నీకీ పీనాకీ పక్కిపానీ తెచ్చినామ్.

చంద్రి—ఓరీ! పింజారీ! నీపానీ పాడుగాను. ఆసీసా నీవేసం పాడుపా చూచినా రంటె నీకు నిఖా కాదు వెంటనే దేఁడీ నికాల్ చేస్తారు.

గులా—ఓసీ! చంద్రిబీబీ! నీకీ మెహర్బానీ మాకీ పూరాగావుంటే బరాబర్. ఈపాకీ గులాంపనీకి నిఖాల్ దేనాకు ఖాతర్ లేను. అవ్. బడేషాదుషా షాజహాన్ మహారాజా హుజూర్‌మె దరూ, అచ్చా సిపాసేస్తాని. తోడా తోడా తాగినూాను. పర్వావహీ. (అని బలవంతము చేయును.)

చంద్రి—ఓరి పింజారీ! గులాంమల్లిగా! జులుంచేసి కులం సెడఁగొట్టావురా? కేసరీబాయి రానీ! ఇది నీలాంటి తాగుఁబోతుల ఆటపాటలు సాగుట కలంఘ్రీడు వారి పరిపాలనగాని చుటియొకటి కాదు.

(అంత; కేసరిబాయి లోపలనుండి) ఓసీ! చంద్రీ! హాజారమున వాగందరగోళమేమి?

గులాం—అబ్బో! కేసరిబేగం వస్తూన్నాది. ఇఁక కాళ్కు బుద్ధిచెప్పి పరారీ అయి పోతాను.

చంద్రి—అమ్మా! ఇదిగో! ఈగులాంపోఁడు జులుంచేసి సారులం పెడగొట్టుతు న్నాఁడు.

(తెర యెత్తఁబడును.)

కేసరి—చంద్రీ! ఏమి పొగరుఁబోతుతనమే. ఈసారాయిబుడ్డి యిచ్చటికేలాగున వచ్చినది? మొన్ననేఁగదా షాహుసాహేబు మనరాష్ట్రములో నెచ్చటనైన సారాయి మొదలైన మత్తుపదార్థములు వాడుకచేయుటగాని, ఉత్సవములలోనికి మేజువాణీల రప్పించుటగాని చేసినయెడల కఠినశిక్ష విధింతుమని చాటింపించి నారు. ఇంతలోననే, రాజాంతఃపురమునందె రాజశాసనము దృణీకరించుటయా! మీకెంత కండకావరముగానున్నది!

చంద్రి—అమ్మా! ఆగులామాలీ యెక్కడనుండియో యీసీసాను తీసికొనివచ్చి యిక్కడ కొంతగడబిడసేసి మీసందడి యినఁగానే పారిపోనాఁడు.

కేసరి—కానిమ్ము. వానిపనిఁ బట్టించెద. ఇప్పుడు షాహుసాహేబు దర్బారులోనే యున్నారేమో నీకుఁ దెలియునా?

చంద్రి—అమ్మా! ఆరింకను దర్బారులోనే వున్నారు.

కేసరి—సరియే; ఈయుత్తరముంగొని దర్బారు ముగియువఱకు వేచియుండి పిమ్మట వారి కొసంగుము.

చంద్రి—సిత్తం. (ఉత్తర మందుకొని పోవును.)

కేసరి—(తనలో) విమలఁ బరాభవింపక గాని నా కీమనోవిషాదం బుపశమించునట్లు తోఁచదు. కానిమ్ము, కమ్మఁ బంపియుంటినిగదా! దీనింగని యిలంఘీరు రాక మసలునా?

చంద్రి—(ప్రవేశించి) అమ్మా! షాహుసాహేబు కొలువు చాలించి యిచ్చటికే వస్తూవున్నారు.

కేసరి—సరియే. నే నిందు పండుకొనియెదను; మహాలులోని వినోదములను నేఁటికి మన్నాచేయింపుము.

చంద్రి—సిత్తం. (విసరుచుఁ దనలో) ఈయమ్మ తలకట్టుకొని పండుకొన్నాది. ఈ దినమున యెవరిపాపం పండిందో?

[అవురంగజేబు పాదుషా ప్రవేశించును.]

అవురంగ—

చ. బలియుఁడు యోధపూరుజసవంతుఁడడంగె; మరాటి లొంగె; బె
బ్బులులగు గోలకొండ బిజపూరు నవాబుల త్రుళ్ళడంగె; వా
ర్ధులపురి సాత్నమీలకుఁ గనల్ తలకెక్కిన విట్టెతుల్లె; బం
దెలమున ఛత్రసాలుని మదింగలగర్వము త్రుంగె నేఁటితోన్.

కాని, యింక నుదయపురిరాజులు మాత్రము స్వాధీనము కాకయున్నారు. కానీ నాకు వీర లొక లెక్కయా!

గీ. తలఁచినంతనె వైరుల గెలిచి సర్వ
భూతలంబు నేకచ్ఛత్రమునను నేలు
బాహుబలమున కలంఘ్యుఁ పాదుషాకు
రాజపుత్రు లనం దృణప్రాయులుగద. 57

వైరిలోకంబు నిర్మూలించుట కతికుతూహలంబునను్న నేనిప్పుడు కేసరీబాయి యంతఃపురంబునకుఁ బోయెద. అరే! గులామాలీ!

గులామ్—హాజర్ మెహర్బాన్! దోస్తాన్! హుజూర్!

అవు—ఓరీ! గులామ్! కేసరీబాయి మహాలునకుం దోవఁ జూపుము!

గులా—జీ! మహారాజ్! ఇదర్ రస్తా కేసరీబాయి సుల్తానా మహల్ కీ యెల్తాది.

అవు—సరియే; మేము జనానాలోనికిం బోయెదము. నీవిచ్చటనే యుండుము.

గులా—హుజూర్కే హుకుమ్.

అవు—ఆ! ఇదియేమి! నేఁడు మా కేసరిమహ లింత విలాసహీనముగా నున్నది!

సీ. అపురూపమైన జంత్రపుబొమ్మ లిచ్చోట
బాగుగా ఠంకాలు లాఁగవేమి?
వివిధరూపముల నివ్వాఱఁజేయు జలయంత్ర
చిత్రము ల్పన్నీరు చిలుకవేమి?
మెఱుపుఁగాంతులఁ గనల్ మిఱుమిట్లుఁ గొన గాజు
దీపాలు వెపయిఁ దోఁపవేమి?

పాశ్చాత్యభూపతు ల్పంపిన నజరుల
నింపి గదు లలంకరింపరేమి?
పలుదెఱంగుల రంగులఁ జెలు వొసంగు
హూణదేశఁపు జంత్రపు ల్మానెఁ బనుల
మహాలులోన వినోద మ న్మాటలేదు
కారణం బించుకేనియుఁ గానరాదు. 58

అదిగో పరిచారికయగు చంద్రి సేవించుచుండ నాహంసతూలికాతల్పంబున మేను చేర్చి కేసరి నిద్రించుచున్నది. (సమీపించి) ఏమీ! ఈమె విగతాలంకృతయై విన్నఁబోయినట్లున్నది. అక్కటా!

గీ. పగఱపాగ రూడెనను శుభవార్తవృష్టిఁ
బొంగి మన్మనోధ్ధురి దరు ల్పొరలిపాఱ
దాని నొక యానకట్టవిధాన నాపె
నంతిపురమున నేఁటికలంత యకట! 59

అయిన నీచంద్రినడిగిన పంగతులు తెలియునేమో. చంద్రీ! నిత్యకళ్యాణమున్, పచ్చతోరణమును నైతనర్చు నీకేసరీవిలాసమందిరము నేఁ డిట్లు వికాసహీనమై యుండుటకుఁ గారణమేమి?

చంద్రి—పాదుసామారాజా! దేవిగారీయాళ తమచరీరం కొంచెం జబ్బుగా వున్నదని, అన్నియు నోదాలికీ మన్నాసేయించారు. ఇంతకన్న యేమికారణము నాకు తెలవదు.

అవు—సరే; మించిన దేమియు లేదు. (తనలో) ఈమనోవ్యాకులకారణం బేమి చెపుమా!

కేసరి—(కలలో) ఓరీ! విచ్చపుజోగీ! నీవేలరా! నాపై కుతికివచ్చుచున్నావు? ఏమేమి? మాయందఱితోడను మొగలాయీసామ్రాజ్యమును మ్రింగివైతువా? ఏమిరా? కొండచిలువవలె నోరుదెఱచి నాలుకం జాచుచున్నావు? అమ్మా! ఇదియేమిభయంకరవిగ్రహము! కనులెఱ్ఱఁజేసి నోరుదెఱచి మ్రింగుదునని నావైకి లంఘించుచున్నది. ఏమీ! విమఁవర్తిఁబు దీర్ప ప్రతిజ్ఞఁబట్టితివా? అహా! ఏమి యీమహాశక్తి? ఏమి మీరందఱు నన్నిట్టిచుట్టుకొని పోవుచున్నారు! నాథా! నాథా! ఈక్రూరులబారినుండి రక్షింపుము.

అక్బ—దేవీ! భయపడకుము. నే నిచ్చట నేయున్నాను. (తట్టిలేపి) కేసరీ! ఓబాలా! నీవెంత జేలవు! కలఁగనినంతమాత్రమునఁ గలవరపడితివి.

కేసరి—(తేరి) నాథా! ఇది కలయా? నిక్కువమే యనుకొంటిని. అబ్బా! ఆ దుశ్చరితు లెవ్వరో నన్నెంత బాధించిరి. ఇప్పటికిఁ బ్రాణములు కుదుటఁబడినవి. పాడుకలఁ గంటిని. ఏమి కీడు మూడనున్నదో గదా!

అక్బ—అదిగో! ఇంకను నీకుఁ బూర్వమతవాసన పోలేదు. ఓసి జేలా! కల లేమిచేయఁ గలవే అదిగాక,

మ. వితతారాతిమదేభయూథముల ఠీవిం దాఁకి తత్కోశసం
స్థితవిత్తంబను మేద మూడ్చి విజయశ్రీమించుచున్ భారత
క్షితిభూమీధరగహ్వరంబుల సదా స్వేచ్ఛ న్వినోదించు నం
చితఢిల్లీశ్వర కేసరీంద్రగృహిణీ! చింతిల్ల నీ కేటికే? 60

దీని కేమిగాని, కేసరీ! నీవియ్యెడ వినోదముల మానపింపఁ గత మేమి?

కేసరి—మనోహరా! ఒక స్త్రీ దురభిమానపరవశయై నన్నుఁ బరాభవించినది. ఆపయి గోరుచుట్టుపయి రోకటిపోటన్నట్లీ చెడుకలఁ గంటిని.

అక్బ—(క్రోధముతో) దేవీ! స్వప్నము మఱచి సంగతిం జెప్పుము. ఏమీ! నిన్నొక స్త్రీ పరాభవించినదా? సమస్తరాజలోకభీకరనిర్వక్రపరాక్రమవిరాజితుఁడగు ఢిల్లీపాదుషా పట్టమహిషివగు నీకును బరాభవమా!

గీ. నిరుపమానసుఖంబున నిజగుహారు
సీమ నిద్రించు కేసరిం జెనకి కలఁచ
సాహసించిన యొక మృగశాబ మట్లు
నిన్నంతఁ దెగించిన నెలఁత యెవతె. 61

కేసరి—పరాభవించుట నన్నొక్కదానినే యయిన నాకంతవిచార ముండకపోవును.

అక్బ—ఆపొగఱుఁబోతు తగవుమాలి నన్నుఁగూడ నిందించెనా యేమి?

కేసరి—చేటీ! పాదుషావారి కీచీటి నందీయవే— ఆ పోటుమాటలు నానోటనపఁజాల.

అక్బ—(చీటిం జదివి) ప్రియా! ఈమె నీచెల్లెలు విమలయా! ఎంతకండకావరము! ఒక్కనిమిషములో దీనికి గర్వభంగము కావించెదను.

గీ. అమరసింహున కిదె యుత్తరమును వ్రాసి,
విమల రప్పించి దాని గర్వము నడంచి,

బాల నీవంటయింటి కుందేలోనర్తు,
పిదప నీవచ్చినట్లు గావింపవచ్చు. 62

ఇదిగో! తాఖీదు వ్రాసి సదరుద్దీనున కంపుచున్నాను. ఇంతమాత్రమునకే వంత యేల? (సమీపించి) సుందరీ! ఇప్పుడు నీ మొగమున కొంకక్రొత్తసొగసు వచ్చినది.

క. కేసరి మొగమల చందుఱిన
కేసరి, కనుదోయి కలువకేసరి, ధృతి నీ
కేసరి కేసరి కేసరి
కేసరినడు మెన్న రాజకేసరి సరియా. 63

కేసరి—ఏమి నేఁడీ యవ్యాజకరుణ! నాథా! అరాతివీరవారణసంహారకేసరులగు మీకు రాణి నెప్పుడయితినో, అప్పుడే కేసరినయితిని. అదిగాక,

తే. గీ. మించి మును తండ్రి కరుణఁ బోషించువాఁడు
మదపుటేనుఁగు రేఁగి పైఁగదిపి తాఁకఁ
గరిని నెదిరించి యెత్తు బంగారుఁ గొనిన
కేసరికి రాణి కేసరి కేసరిగద 64

అవు—సుందరీ! చిన్ననాఁటి యేనుఁగులపోరాట మాటయా జ్ఞాపకము తెచ్చుచున్నావు!

గులాం—(హాజారమునుండి) ఖాసా వజీర్ పాదుషావారికి దరఖాస్తు పంపినార్

కేసరి—నాథా! గులాం వజీరువద్దనుండి మనవి తీసికొని వచ్చినట్లున్నది.

అవు—ఓసీ దాసీ! చంద్రా! దానిందేసికొనిరమ్ము. (దాసి తెచ్చియిచ్చిన లేఖం జదివి) కేసరీ! మే మిప్పుడేవత్తుము. ఏకీ! (ముద్దిడఁబోవును.)

కేస—చాలు! చాలు! ఏ మంత తొందర?

అవు—

తే. గీ. ఆరవిలిపర్వతప్రాంతమందు రాజ
సింహుసైన్యంబు లోకలోయచెంత డాఁగి,
అక్బరుకుమారు సిబ్బంది నడ్డగించె
నఁట, హాటాహుటి జని దాని నరసివత్తు. 65

కేసరి—ఏమీ! యువరాజు అక్బరునిబ్బందులనే? అయినను పేక్షింపరాదు.

(అవురంగజేబు నిష్క్రమించును.)

కేసరి—చంద్రీ! వారముదినములనుండి మన జనానామందిరమున కొకపకీరుగంబరుండు వచ్చుచుఁ బోవుచున్నాఁడు. అతఁడు మక్కా పకీరులను మించిన మహిమగల వాఁడఁట. నేఁడాతఁ డీయెడకు రాలేదా?

చంద్రి—అమ్మా! వచ్చేవేళయింది. అదిగో పాట యినొస్తుంది.

కేసరి—పోయి వానిఁ బిలుచుకొనిరమ్ము. ఈస్వప్నఫలము కనుఁగొందము

(దూరమునుండి పకీరుపాట వినంబడును.)

చంద్రి—చిత్తము. (పోయి పకీరుతోఁ బ్రవేశించును.)

పకీరు—(తనలో) ఆయోగి చెప్పినచొప్పున నిన్నిదినంబులనుండి యిచ్చట వేసుఁ గను చున్నందుకు నేఁడు సార్థకమగునేమో! నిన్న నాగులామున కొక్కింత సారాచుక్కనొసంగి యంతఃపురరహస్యములు వెదఁ గ్రక్కించితినిగదా! వానినే యీమెకు నోదెచెప్పి నమ్మకము కలిగించెద. రూపనగరవిశేషములు నాకుఁ గొంత యాధారము కాకపోవు. ఆగులా మేమేమియో పేర్లుచు యోధపురిపురోహితునిమాట సందిగ్ధముగాఁ జెప్పె. దాని నిజ మారయవలెను.

చంద్రి—పకీరయ్యా! అదిగో! బేగంగారు నీకోసం సూస్తున్నారు. రా!

కేసరి—పకీర్జీ! సలాం! రండు. ఇటు గూర్చుండుఁడు.

పకీరు—సలాం! సలామత్ రహోమాయీ! అల్లాకీ మెహర్బానీసే మీకి సుఖం వుండాది. మట్టిందీ మోతీ పట్టిందీ బంగారంఅవతాది. మీకిబహుత్ జయం రాబో తాది. కానీ కొద్దిరోజుల్మే మీకీ దిల్ పర్ షికాక్ వుండాది. హమేషా దాన్కి ఆలోచన్ సేస్తూవుండారు. నీకీబాయీ ఇస్లామ్‌కే దూసన్ సేసింది. బేటీ తెచ్చింది.

చంద్రి—అబ్బో! యీపకీరయ్యకు కర్ణపిశాచి ఉందాయేమ్ చెప్మా? సూసినట్టుగా నే పుట్టుపూర్వోత్తరాల్తో గుట్టుమట్టెల్లా సెప్పేస్తున్నాడు!

కేసరి—అవును. నిజమే. ఇదియాటుండఁగా నేనొక పాడుకలఁ గంటిని.

పకీరు—మ్వప్నం! ఫర్మానహీ! మేము నమాస్ సేస్తాం. కానీ మేము అడ్గేసవాల్కి ఠీక్ సమాధానంసెప్పు. పాదుషావార్కి నీకీ బాయీకీ బేటీమాట సెప్పినావా. సెప్తే పాదుషా యేమ్ సేసినాడ్?

కేసరి—ఆ! చెప్పితిని. అప్పుడే విమలనుబట్టి తెప్పించుటకు తాఖీదు పంపినారు.

పకీరు—అరే! రే! అల్లా! ఎంతబుద్ధిలేని కామ్ సేసినావ్. ఇమ్లాకీ ముఖం ఫాదుషా సూస్తే నీకీ ఆఖోర్ సిక్కుతాదీ?

కేసరి—అయితే తాఖీదప్పుడే పంపితిమిగదా! ఇప్పుడు చేయునదియేమి?

పకీరు—ఏమీలేదు. దాన్ని నీఆడాంలో ఉంచుకో. ఫాదుషాకి సూడరాద్. భద్రం.

కేసరి—సరే! కాని నాకలసంగతి చెప్పినావు కావు.

పకీరు—ఆ! స్వప్నం! సెప్తా. (నమాస్ చేయుట నటించి) అచ్ఛా! ఇది మరీ యేమీలేదు. బొమ్మక్క పిశాచి. ఇక్డ ఒకబడేబొమ్మక్క జపర్‌దస్తుమే ఖూని సేసినార్ - ఆను పీడ అయి నీకీ పీడాసేస్తాడ్. పర్వానహీ. ఇదే ఉంగ్రమ్ పెట్కో.

(ఉంగరమీయగా గేసరి ధరించును.)

కేసరి—చంద్రా! ఇదియేమే? ఇక్కడ నేబ్రాహ్మణుని జంపివేసిరి?

చంద్రి—అమ్మా! జోదుపురంనుంచి, ఒక బాపనయ్య ఉదయపురాని కుత్తరాలు పట్టుకెలుతూంటే మనచారులు మాసి అతన్ని సంపేశారంట. గులామన్నాడు.

పకీరు—వేద్యూక సంపినార్ - ఉత్తరాంమే ఏమివున్నాది?

చంద్రి—ఆదేమో-ఆవుత్తరంలో ఎవరో తల్లి తనకు వంట్లో బాగులేదని పిల్లోణ్ని పంపించమని తమ్ముడికి రాసిందట.

పకీరు—దేఖో! యెంతఘోరం - ఆవుత్తర మేమ్ సేశార్?

చంద్రి—ఏంచేస్తారు ఫాదుషావారి కిచ్చేశారు.

పకీరు—ఇఖ మాకి వఖత్ నహీ- నమాస్కీ పోవాలా. మాకీ సెలవు. సలాం. (పయికివచ్చి. ఇంకంబోయి ఫాదుషారహస్యములు కనుంగొనవలెను.

(నిష్క్రమించును)



శ్రీ

# రసపుత్రవిజయము.

## తృతీయాంకము.

### 1. రంగము — విమల ప్రమదావనమందిరము.

లయగ్రాహి.

మొల్లముగ నల్లుకొను మల్లెపొదరిండ్లఁ బ్రియుఁ
డుల్లసము లాడి మది నల్లసిలఁ జేయన్
వల్లరుల తావిఁ గొని పిల్ల-వలిగాలి సుమ
వల్లరులఁ జేరి వగ వెల్ల వెసఁ ద్రోయన్
వెల్లనగు వెన్నెలల వెల్లువలు పాఱి మది
పల్లవుఁ బొలాన స్మరవల్లి నలరింపన్
చల్లని వసంతసిరిఁ దల్లివలెఁ గాచు నెల
పల్లవుల కోర్కుల మొకల్లు చిగిరింపన్. 66

(నిట్టూర్పుపుచ్చి) హా! హా! పిండి యారఁబోసినట్లు బ్రహ్మాండము నంతయు నిండుకొనియున్న యీ నిండుపున్నమనాఁటి రేయెండ మహీమండలంబునంగల సర్వజంతుసంతానంబున కెంతయో సంతోషదాయకంబే యయినను నన్నుఁబోలు విరహిణీజనసమూహమ్మునకు మాత్రము సుధాకరకరవిముక్తసమ్మోహనాస్త్రంబో యన సంతతసంతాపకారణం బగుఁగదా! ఆహా! నాఁడా సరోవరప్రాంతకాంతారమహీరుహంబు పొంత నాయంతరంగం బపహరించిన యాధారుణీకాంతుని, నవయువతీమనోవినూతనరతీకాంతుని, స్వకీయముఖవికాస తృణీకృతశర్వరీకాంతుని, మన్మనఃకాంతునిఁ గ్రమ్మఱం గనుల కఱవుదీఱం గనుంగొను భాగ్యము నాకబ్బునో లేదో?

ఆహా! ఆ లేజవ్వనంపు నవ్వుమొగంబు నొక్కపరి చూడఁ గలిగితినేని, క్రొవ్విరి నొవ్వకుండ నవ్విరి మొవ్వంపుం బేటిక నివ్వటిలు పువ్వుఁదేనె నాస్వాదించుమధువ్రతం

మంజరి—ఎవ్వరిమీఁదనోయన నేల ? ఒక్క రాజసింహునిపై మక్కువయేకదా యీ మిక్కుటంపు టుక్కునకుఁ గారణమైనది ?

విమల—చక్కఁగ బొమ్మా ! నీయొక్క సక్కెములకేమి గాని నిదురరాక యుబుసుపోకకు నేనొక చక్కనిశృంగారనాటికలోని విరహిణీనాయికాకథాభాగముం బఠించుచుంటిని. ఇంతమాత్రమునకే మనసులో లేనిపోని యనుమానము లూనఁదగునే ?

మంజరి—ఏమో ! నీవా నాయికాభాగము పఠించుచుంటివో నటించుచుంటివో నీకే యెఱుక. కాని నెచ్చెలీ ? అప్పుడే సగమురాత్రి మించినది. పండుకొమ్ము.

విమల—చెలీ ! నాకేలయో నేఁటిరేయి నిద్రరాదు. కేళీవనంబునకు వచ్చెదవా ?

మంజరి—ముద్దుగుమ్మా ! ఎంతముగ్ధురాలవమ్మా ! అర్ధరాత్రియందా, ఉద్యానవన విహారము ?

విమల—నెచ్చెలీ ! పుచ్చపువ్వువలెనున్న యీ వెన్నెల కన్నతల్లికదా ? తల్లిచాటు పిల్లకేమిభయము, పోదము రమ్మ

మంజరి—కోమ్మా ! నాకెంతమాత్రము సమ్మతిలేదు. పైని నీచిత్తము. మొదట మనము కోట విడిచి విడిగా నీయుద్యానవనమందిరమున నివసించుటయే తప్పు. ఆమీఁద నర్ధరాత్రియందిట్టి ప్రసంగముచే మాట రెండవతప్పు; ఇఁక కేళీవనవిహారమునకుం బోయి ముఖ్యముగా మూఁడు తప్పులు చేసిన పిమ్మటకాని నీకు నిద్రపట్టదు కాఁబోలును.

విమల—మంజరీ ! కోపగింపకే. గాలిలేమి నొడలుడుకెత్తి నిద్దురరామి నట్లంటిని. పోనీ యుపవనంబునకుం బోవలదు. ఆదక్షిణద్వారమైనను దెఱచెదవా ? గాలివచ్చునేమో ?

మంజరి—అదియు నాకిష్టములేని పనియే (పోయి తెఱచి ద్వారమునకడ్డుగాఁ బండుకొనును)

విమల—(సోఫాపయిం బండుకొని నిద్రపోవును)

[అంత సదరుద్దీను, తాఖీదుపట్టుకొని సిద్దీలతోఁ బ్రవేశించును]

సద—బలే ! ఎన్నిరోజుల్కి నిఖా సెయ్యడాన్కి మాకీ మంచిదఖాత్ వచ్చిందిరా భాయి. అల్లాకీ మెహర్బానీసే అచ్చాహావకాసం సిక్కింది. అదృష్టమ్‌సే ఈ యిబ్లీ మాకీ నిఖా సేస్తే మక్కాలో మసీద్ కట్టిస్తాన్ పకీర్లకీ దరోబస్తు పులావ్ బాల్ సేస్తామ్ అయితే ప్రస్తుతం యిబ్లీని పుడాయించే బందోబస్తు చేయ్

వాలె. బహుత్ జరూర్ మె హుషార్ సే సెయ్‌వాలె. అరే కొజ్జాసిద్దీరాం. ఇదార్రివ్. మనం ఇదర్ రస్తామె యెందీక్కి వచ్చినామ్ నీకీమాలుమ్ ?

సిద్ది—సై—సర్దార్-మీదీ హుకుం పట్కొవస్తావున్నామ్.

సద—దేఖో ! ఇది రూపపూర్ జమీ ఉమార్రివ్ అమీర్ సింగ్-మాలుం-కేసరీబేగమ్ కేబాబ్. అడిక్కడుసిర్రిజేటీ ఇన్లీ ఫేల్యాగ్ ! ఇప్డా హుషార్ సే దాన్కిపట్టి కైద్ చేసి తీస్కొపోవాలా. జరూర్ ! ఫాదుషా జీ తాకీద్.

సిద్దీ—హుజూర్ హుకుంబరాబర్ సేస్తామ్ సర్దార్.

సద—అచ్ఛా- జల్దీఆవ్ (గోడదాంటిపోవుదురు.)

సిద్దీ—(మేడవైపుమాపుచు) సర్కార్ జీ! దేఖో! మందిర్మెవుప్పర్ మినుకూ.మినుకూ దీపం. దచ్చినమ్‌మే దర్వాజా తెఱచీవుండాది.

సద—అచ్ఛా. మదీ ఆజ్ కరోజ్ మంచి అదృష్టం జల్దీ వుప్పర్ కేజావ్. ఎవరూ యెగరూవుండాది సూసీ జేగీసెప్పు. కఫడ్ దార్.

సిద్దీ—సర్దార్. దారీతెల్వాదు తెన్కా తెల్వాదు, మీదికీయెక్కడం కష్టం.

సద—ఇదేసూడు. బడేతమాష్‌చేస్తాక్ (అని సంచిలోని యేడునునుదీసి మెడకు తాడుకట్టి మేడమీదికి విసరును) ఇఖ తాడూపట్కొ వుప్పర్ జావ్. హుషార్.

సిద్దీ—(తాడుపట్టుకొని మీదికెక్కి) సర్దార్ ! అదృష్టమ్‌సే దర్వాజా తెరచీవుండాది. కాని యిక్డ యిద్దరు వున్నార్. ఒకటి సోఫామే బిషాణా సేసింది. రెండూ ఖింద తివాసీమే సోయా సేసింది.

సద—అరే! కామోష్ ! మందు నిద్రపోతున్నారులేదూ సూడు.

సిద్ది—ఎట్లు సూడ్డం ? ఇద్దరు బిషాణాపర్ వున్నారు.

సద—దాన్కివుపాయం సెప్తాక్ సునో - దమ్ పరీష్ వస్తూంవీ లేదూసూడు. అదే మంచి నిదర్శనం సూడు.

సిద్ది—(చూచి) అచ్ఛా వస్తూవుండాది.

సద—ఇదే కప్పీ. షేణీకి కట్టి సోపాతో నే దించివేయ్. కఫడ్ దార్.

(సోపాతో విపులను కిందికి దింపియెత్తుకొనిపోవుదురు.)

## 2 రంగము—యోధపురసమీపమున మొగలాయీల శిబిరము.

ఫకీరు—(ప్రవేశించి) నాఁడాకేసరికి స్వప్నఫలము చెప్పనెపంబున కొన్నిరహస్యాం బులు తెలిసికొంటిని. మిగిలినసంగతుల నెఱుంగుటకై యిప్పుడీ మొగలాయీ

శిబిరముతో వచ్చితిఁగదా; నేఁటి రేపటి వచ్చినపని ముగించి యోగివద్దకుఁ బోవలెను. పాపము! రూపపురమున తన నెచ్చెలియగు విమల మొన్నటిరాత్రినుండియు కానరాలేదని వెదకుచు మంజరి నిన్న నిటఁ గానఁబడినది దానికిఁ గొంత యుపదేశించితిఁగదా. పైని దైవమున్నాఁడు.

[అంత అవురంగజేబు మయిస్తఖానుతోఁ బ్రవేశించును.]

అవు—ఫకీర్ జీ! మీరిచ్చటనే యున్నారా? ఇఁక నమాస్ చేయుదమా?

(చిత్తము అని యందఱు నమాస్ చేయుదురు.)

(మయిస్తాఖానుతో) మామాజీ! జోధ్పురపురాణి నగరములో లేదా! కానీ! ఇదియు ననుకూలమే! మామా! అన్నట్లు యువరాజు, అక్బరుసహాయమునకు సిబ్బందులతో దిలేర్ఖానుఁడు వెళ్ళియుండెనా?

మయి—చిత్తము. నిన్ననే దరోబస్తు తయారీచేసి పంపినామ్.

అవు—మామాజీ! చూచితివా? ఈయూసపిల్లి పర్వతములందలి సృష్టివైచిత్ర్య శృంగారము.

సీ. జయపుర జోధ్పు రోదయపురాజ్యములు
నలుదెసల్ బురుజులై బలిసియుండ,
అలచితూర్గఢము సింహద్వారమై తూర్పు
దిక్కున నెక్కుడై పిక్కటిలఁగ,
భూరిభూధరాబూమహాశిఖరంబు
పెక్కెంబు గంబంపు తీవిఁ దనర,
ఒకదెసలూని మఱొకవంక చాంబల్ ప్ర
వాహముల్ పరిఖలై బలిసిపాఱ,
ఆరవిలిదుర్గ మిచటఁ జెన్నారు నొక ని
సర్గదుర్గమై పరులకు దుర్గమయి
రాజపుత్రుల క్షాత్రియరాజసము వి
రాజమాన స్వభావచిత్రముల నింపి. 67

మామాజీ! అందులో సినోహపురదుర్గము యోధానుయోధులగు నీరహిత్తూరు రాష్ట్రీయులఁ యోధులచే సంరక్షింపఁబడుచుండుటచే నన్నిటికన్న మిన్నగా నెన్నఁ

దగినది వీరు మరణమన్నఁ దృణప్రాయముగాఁ జూచెదరు. హిందూస్థానము దెల్ల యెడల నిట్టి సర్దారులే యున్నయెడల మనవారి కిచ్చట కాలుపెట్టుటకైన నవకాశము నిచ్చియుండరు సుమీ.

గీ. మేనఁ బ్రాణంబు తొలఁగినఁగాని కేల
వాలునుం డాలు విడనాడువారు కారు
వీరబలులైన రహతూరు వీరవరులు
చొర నశక్యంబు, వీరుండ, జోధ్పురంబు. 68

ఈయోధపురమునం దతిరథులును, అతిరథశ్రేష్ఠులును, మహారథికులును, మహారథికాధిపులునగు వీరాధివీరు లుండఁబట్టియేకదా కాఁడాజోధ్పురపురాణి గౌరవము చిక్కినది. ఈరాజ్యము దక్కించుకొన నేదియేని నిరపాయంబగు నుపాయం బాలోచించి చెప్పుము.

పయి—మామాజీసర్కార్! ఇప్డు దేశం అగల్ బగల్ అల్లకల్లోలం జాస్తీఉన్నాది. లడాయికి అవకాశంలేదు.

అవు—అయిన నీయాలోచనయేమి?

పయి—ఇక్డ వొకహద్మి జసవంతసింగ్ సుట్టవున్నాడ్. ఆడ్కి రాజ్యంయిస్తే ముప్పయి లక్షాల్ లంచమ్ మన్కి యిస్తాడ్ ఖరార్ సేసినాడ్.

అవు—సరియె. ఇంకను జూచెదవేమి? ఖరారుప్రకారము విత్తముం దక్కించుకొని, అతఁడు జస్వంతునికి జ్ఞాతియనియు, ఉదయపురములోనున్న బాలుఁ డజిత సింహుఁడు జస్వంతుని సంతానము కాఁడనియు, రాణి యెవ్వరో దాసీపుత్రుం జేరఁదీసి, అన్నగారింటికిఁ బెంపఁబంపించెననియు, జస్వంతుని కుమారుండగు మహమ్మదాజీయను రాజపుత్రుం డిప్పుడు ఫాదుషావారి దర్బారులో రాజ్యపాలన విధాన మభ్యసించుచున్నాఁడనియు జాటింపించుము.

పయి—అచ్ఛా! సర్కార్సలహా బడేఖాయక్ వుంది. మామాజీ! ఇఖసర్కార్కా కామ్ సాసాయించి వస్తామ్. (తనలో) ఇదె వఖత్ మె మంచిజాగీర్ సంపాదించ్వాలా. (నిష్క్రమించును)

అవు—ఎవరక్కడ?

చారుఁడు—(ప్రవేశించి) ఫాదుషామహారాజ్ సలాం,

అవు—నీవా? వినుల సమాచారమేమి?

చార—బాదుషావారీ తాకీదుక్కు మాఫక్ సదరుద్దీన్ యిల్లాకి ఖైదుచేసినార్.

**అవు**—మంచిది. నీవు వెంటనేపోయి కేసరీబాయి చీకటికోటలో విమలను ఖైదు చేయింపుమని సదరుద్దీనునితో చెప్పుము. పొమ్ము. ఇదిగో హుకుం. (హుకుమిచ్చును చారుఁడు పోవును) ఫకీర్జి! సెలవు!

(నిష్క్రమింతురు.)

ఫకీరు—(ముందుకువచ్చి) నేఁడు పెక్కురహస్యము లెఱింగితిని. ఇఁక నవశిష్టము లేదు. వెంటనే పోయి యోగి కెఱింగించెదను. (పోవఁ దొరకొనును.)



## 3 రంగము—చెఱసాల.

విమల—(విచారముతో) కట్టా! స్వాతంత్ర్యించి చేఁజేతల నెట్టిమహోపద్రవముం దెచ్చుకొంటిని అక్కా! నాఁడా యశేషశేముషీప్రసూనమంజరి యగు మంజరి సమంజసహితోపదేశపుంజముం జెవిం జొనీయక యుక్కివడిం జెడిపోవనై నడిరేయిం గడువడి దక్షిణద్వారం బేల దెఱపింపం గడంగితిని? కడంగితినిపో! తలఁచూచి కాచికొని యున్నట్టు లంతలోననే యాహంతకారి నిద్రాపిశాచం బావేశింపనేల? ఆవేశించిన నేమాయెను. ఏమాయ నెఱుంగక యెట్టిమహోపద్రవంబు లందైన మేనునకుమేనై ప్రాణంబునకుఁ బ్రాణంబై, కంటి ఱెప్పలవలె నన్నుంగాపాడుచుండెడి వివేకమంజరికి, మంజరికి, మంజులగుణసుమమంజరికిఁ గూడ వత్తుమందు చల్లిన ట్లానిమునంబుననే నిదురరావలయునే? వచ్చిన నేమాయె; మాయలమారులగు నాముచ్చులు యమదూతలవలె వచ్చి నన్నిచ్చటికి ముచ్చిలించుకొని రానేల? తెచ్చిన నేమాయె; ముసలిమానువలెనున్న యీ ముసల్మాను ననుంగని మరులుంగొని పలుభంగుల బాధించి యీచెఱసాల నునుపనేల? అక్కటా! విధి యిన్ని యిక్కట్టులకుఁ బాల్పడఁజేయుచున్నవాఁడు! ఇక్కడ నాకెవరుదిక్కు?

[అంత సదరుద్దీను ప్రవేశించును.]

సద—ఏమీ యిల్లా! ఇంకా నీకీబుద్ధి తిరిగిందీలేదూ? ఈబందిఖానాలో నెందుకు హోలీగా దుఃఖపడ్తావ్? నీకీ మంచిసదుపాయం సెప్తామ్ సునో. కేసరీబాయ్ నీకీ శిక్షెన్నాకు యెందుకు హుకుం జారీచేయించింది మాలుమ్?

విమల—ఓయీ! నీయసందర్భములకు నాకర్థము తెలియదు. నావంక రాకుము.

సద—నీకీ ఖుష్ కారం సెయ్యడానికీ వొస్తే పందేమం పడ్తావ్ యెందుకు? కేసరీ

ఖాయ్ నిన్ను తప్పా గులామ్‌కీ నిఖా సేస్తాది. యిన్నో నామాట. దేఖో నా తాఖత్.

విమల—హా దైవమా! ఈ క్రూరశార్దూలములనడుమ నొక మృగశాబమట్లు చిక్కి మిక్కిలి చిక్కులు పడుచున్న యీదిక్కుమాలిన నన్నుం గాపాడుము.

... ... ... ... ... అక్కటా! ప్రాణసఖి మాట నిరాకరించినఫలం బనుభవించుచున్నాను గదా?

ఉ. అక్కట లోకింతురా బయలజివ్వనఁ జాలఁదలంచి నిచ్చలున్
మక్కువఁ బెంచు తల్లినుడి నాదెసనెంచక విఱ్ఱవీగి కూఁ
డెక్కి, యశక్తిచేతను మహాస్థలిఁ గూలెను చిల్కపిల్ల నాఁ
జిక్కితి నిర్భయోద్ధతిఁ దూరకచే జెలిమాటల నాదరించుటన్. 69

సదరు—ఇబ్లీ! నీకీపర్వానహీ. ఒక్కవుపాయం సెస్తామ్ యిన్నో. మాకీ నిఖా సేస్తే నీకీ బడేబీబీసేస్తామ్. వుత్తసెయెందుకు యేద్వడం. మతం, గితం వోడ్దేవ్, నిఖాకరో.

విమల—అక్కటా! యింక నాకేమిదిక్కు? ఈపలుగాకి యేకాకినగు నన్నేమి చేయునోగదా! ఓదీనబంధూ! లోకైకరక్షకా!

సదరు—ఓసీ! సవాల్కీ జవాబు సెప్తావ్ లేను. జల్దీసెప్పకపోతే జులుం సేస్తామ్. కఫ్తార్.

విమల—ఓరీ! మూర్ఖతురుష్కాధమా!

ఉత్సాహ. తులువ! తొలఁగి చనుము వేగ దుష్టబుద్ధు లేల? నీ
చెలిమి బలిమిఁ గలిమిఁ జూచి చెట్టబట్ట వేనవేల్
చెలులు గలరు, వారిచెంతఁ జేరి యిట్టి బింకముల్
పలుకు మీడ నాడనేల? వ్యర్థమౌ ప్రసంగముల్. 70

సదరు—నీకీ యిఫ్డా బుద్ధీ సరీలేదు. ఆలోసించుకో మగర్ వస్తామ్. (పోవును.)

[అంత మంజరి సారాసీసాపట్టుకొని తురకవేషముతోఁ బ్రవేశించును]

మంజరి—మానెచ్చెలియగు విమలను సదరుద్దీను సిద్దీలచే దెప్పించి కారాగృహబద్ధురాలిం జేసెనని యీయోధపురప్రాంతమున నొక పకీరుచెప్పె నేనెట్లేని నామె న్విడిపింపవలయును. కావున నే నీపూరుషవేషమున కారాగారమునకుం జని, కారాగృహపాలకులకు నీమధురసంబు పసదనంబుగా నొసంగి, మత్తునొందించి, మామత్తకాశినిని బంధవిముక్తురాలిం జేయవలయును. (పోవును)

(కారాగృహపాలకులు ఫారాయిచ్చుచుందురు)

కా-పా—కోన్ హాయిరేతుమ్ బందిఖానాకు ఆనాకు అధికారంలేదు. పో! పో!

మంజరి—అరే! భాయి! పీనాకీ మంచి దారూ తెచ్చినామ్.

కా-పా—క్యా? క్యా? సారా! ఆవ్! ఆవ్! ఎన్నిరోజులక్కు మజామజా సారా చూచినామ్ ఏదీ! లేవ్! లేవ్!

(మంజరి సారా నొసంగ కారాగృహపాలకులు త్రాగి మత్తెక్కి పడుదురు.)

మంజరి—వీరికిఁ బూర్తిగా మత్తు నెత్తి కెక్కినది. ఇఁక సత్వరముగ విమల న్విడిపింప వలయును. (అని చెఱసాలం జేరును.)

విమల—అదిగదిగో! మఱియెవ్వరో తురకయే వచ్చుచున్నాఁడు. అతఁడీ మొఱకు తురక పంపిన రాయబారి కాఁబోలును. ఇఁక నామానరక్షణంబు దుస్తరంబు. మానభంగమైన మానినీశిరోమణికిఁ బ్రాణంబుతోఁ బనియేమి? ఇదే యీవజ్రపుఁబొడి త్రాగి యసువులం దొఱంగెద. ఓదయామయా! పరమేశ్వరా! ఈ జన్మంబున ఆ రాజసింహునిఁ జేపట్టనోముకో నేఱనైతి. ఇఁక ముందటిజన్మంబునం దయిన, ఆసుకుమార మారసుందరాకారునకుం దారను గానగు భాగ్యం బనుగ్రహింపుము. ఇదియె నాతుదివందనం బందుకొనుము. (అని ప్రాణత్యాగము చేయ నుంకించునంత మంజరి ప్రవేశించును)

మంజరి—విమలా! సాహసము మానుము! సాహసము మానుము! నేను నీనెచ్చెలినగు మంజరిని. కాని తురకను గాను. (అని కంచుక శిరోవేష్టములం దీసివైచి నిజరూపముతోఁ బ్రవేశించును.)

విమ—మంజరీ! మదీయమనోమనుపరితసంతాపహారణనుమమంజరీ! ఇప్పటికి నా ప్రాణము కుదుటపడినది. నెచ్చెలీ! నీవెచ్చటనుండి యిచ్చటికి వచ్చితివే? నాఁడు నీమాట జవదాఁటిన మోటుతనంబునకు నాకుం దగిన శాస్తియైనది.

మంజరి—అయిన దేదియో యైనది ఇక్కడ తడవు మసల వీలులేదు. బీగము పెకల్చెద. వేగమురమ్ము. (ఇద్దఱును పైకిరాఁ దెరజాఱును.)

మంజరి—నెచ్చెలీ! విమలా! ఊరిబయట మామిడితోఁటలో నశ్వముల నాయత్తముచేసి యుంచివచ్చితిని. తత్తలపడిపోదుము రమ్ము.

(నిష్క్రమింతురు.)



## 4. రంగము—కొండలోయ.

[ఆరావళికొండలోయలో మొగలాయీ సిబ్బందులు చిక్కుకొనియుండ దరీముఖంబున రాజసింహుఁడు మోహరించియుండును.]

రాజసింహుఁడు—

మ. అదిగో! పాపము! మ్లేచ్ఛసైనికులు దైన్యంబంది యీకొండప్ర
క్కదరీద్వారము మూయఁగా నల విహంగవ్రాతము ట్లింకులో
నఁ దిం దిండియుఁ ద్రావ నీకనక ప్రాణాల్ చేతఁబోఁబూనినా
రు దయామయత్తత వీరిఁ బోవిడదిగన్ ద్రోహంబు నూహింపరే.

పాప మీ దైన్యసైన్యము లన్నపానములు లేక ప్రాణమాత్రావశిష్టులై యున్నయవి. రణరంగమున ముఖాముఖిం బోరాడి, అరాతులం బరిమార్చవలయునే గాని, అన్నపానీయము లీయక కడుపుమాడ్చి చంపుట క్షత్రియధర్మంబు కాదు. కాని మేము లేనితఱి నదయపురము స్వాధీనముచేసికొను దురుద్దేశముతో నరుదెంచిన యీముష్కర తురుష్కసేనలం గనిన నాకుం గనికరము జనింపకున్నయది.

[అంత యోగివద్దనుండి యొకచారుఁడు ప్రవేశించును.]

రాజ—(తనలో) ఇదే! క్రూరుండెవ్వఁడో శత్రుపక్షమునుండియే కాఁబోలు వేగఁ గనవచ్చుచున్నవాఁడు. (పైకి) ఓరీ! క్రూరా! విరోధిపక్షమునుండి వచ్చుచున్న చారుండవని నిన్ను నే నెఱుఁగుదును. నీమాటలు నాయొద్ద సాగవు. చూచితివా యీ శాతకరవాలము?

చారుఁడు—స్వామీ! మీపదంబులాన! నే శత్రుపక్షములోనివానిని కాను. యోగిగారు తమ కీయుత్తర మీయ నన్నంబుత్తెంచినారు.

రాజ—(ఉత్తరమందుకొని యిట్లు చదువును)

"స్వస్తిశ్రీ ఉదయపుర మహాసామ్రాజ్యపతిరక్షణ ప్రశస్తహస్తులగు రాజసింహ మహారాజావారికి—

ప్రస్తుతము ఢిల్లీపురప్రాంతమునుండి ప్రచ్ఛన్నానందయోగి, ఆశీర్వచన పురస్సరంబుగ వ్రాయు విజ్ఞప్తి.

మీరు దరీద్వారము చెంత నప్రమత్తులరై యున్నారని విని సంతసించితి. విరోధులపైఁ గరుణవహించి దరీద్వారమును మాత్రము తెఱపింపఁజనదు. తన కుమారుని దురవస్థ విని యాలంఘీ రొకపెద్దసిబ్బందిని దిలేర్ఖానుం డను తన ప్రధానయోధుని యాధిపత్యము క్రిందఁ బంపుచున్నవాఁడట. ఈ రెండుసైన్యము లేకమైన మన కజేయమగును.

యుక్తిపరుఁడగు నా మ్లేచ్ఛయోధుఁ డొకవేళ నుదయపురముపై దాడి వెడలునేమో! జాగ్రత్త! ఉచితజ్ఞులగు మీరు నే నుపదేశించునంతవానిని గాకపోయినను, చనువు బలిమిం దీసికొని యధికారమునకు క్షమింపంగోరు,

ప్రచ్ఛన్నానందయోగి”

సరియే విమలసమాచార మేమైనదో నీ వెఱుంగుదువా?

చార—స్వామీ! ఆమెను రూపనగరంబునుండి తప్పించి కేసరీబాయి ఖైదునుచేయించిన దని పకీరువేసముననున్న యొకచారుఁడు యోగిగారితోఁ జెప్పుచుండ వింటిని.

రాజ—ఏమీ! విమల కేసరిచే ఖయిదుచేయింపంబడినదా? ఎట్టి చెడువార్త వింటిని! అయ్యో! నిర్మలమనఃకమలయగు నో విమలా! తుదకు నీ కీదుర్గతి తప్పినది కాదుగదా!

చ. జననము నొందినట్టి నిజవంశమునందె మతాభిమానివై
మనసిజమూర్తియైన సుకుమారుని రాజకుమారుఁగాక మ్లే
చ్ఛుని వరియింపనొల్లనని సోదరితోడఁ బ్రతిజ్ఞఁ బట్టి యే
పునుగని నాపు నీకుమతమున్ వ్రతమున్ గతమయ్యె నయ్యయో!

చారుఁడు—దేవా! అతిమానుషప్రతిభాశాలియగు మన యోగివరుం డుండ విమలకుఁ గాని, ఆమెవ్రతంబునకుఁ గాని గోరంతేని కొంతకలుగునే! ఆపరోపకారపరాయణుఁడు, ఆమెను విడిపించు ప్రయత్నము చేయుచునే యుండును.

రాజ—అందుకు సందియము లేదు. అయినను నీవు వేగముగా నేగి మన యోగివరునితోఁ జెప్పిన వేగులవానిఁ గడిగి, ఆమెలనాగ యథార్థోదంతంబు లెఱింగిరమ్ము. యోగిగారి యాజ్ఞ శిరసావహించితినని చెప్పుము. వేగముగా పోయిరమ్ము.

చారుఁడు—(ప్రణమిల్లి నిష్క్రమించును.)

రాజ—అక్కటా! అమాయకురాలగు విమల యెట్టియిక్కట్టులలోఁ జిక్కినది! సహోదరీసువ్యాఘ్రజకేసరియగు కేసరి యెంతటి దోసమునకైన సాహసించును. ఆ క్రూరురా లమాయకురాలగు నీజవరాలిని, నిజగమననైపుణీకృతరాజమరాళిని, గుణశాలిని, పరమయోగ్యురాలిని, ఏమేమిబాములం గుడిపింప సమకట్టి యున్నదో కదా? అజిత్తులమారి యా మత్తకాశినిం దనచేతఁ జిక్కించుకొనినది. ఇఁక నెట్టియిక్కట్టులం బెట్టునో? కట్టా! ఏమిచేయనగు?

ఉ. సోదరియింటిలో విమల సుక్కెడునంచును జాలిఁ జెందనా?
ఈదరి శ్రాసి నేఁ జనిన నేమగునో యని యూరకుందునా?

మీఁద నరాతిసైన్యములు మించి పురిం జొరఁ గాచికొందునా?
ఏదియుఁ దోఁచ దీయెడ నిఁకేయది చేయుదు నందనందనా? 73

అక్కటా! కులపత్నీమణియగు విమల, ఆజడమతులవశమై యెట్టియిడుములం బడుచున్నదో కదా?

ఆ. వె. లేమ పగఱ నడుమ నేమి బాములు పొందు
చున్నయదొ? మఱెట్టు లున్నదొక్కొ?
కాకిమూఁకనడుమఁ గాసిలు నొకపిక
పోతమట్లు దిక్కు మొక్కులేక. 74

అయ్యో! పోయి నేనే విమలను బంధవిముక్తురాలినిగాఁ జేసి తెత్తునన్న పరోపకారపరాయణుండగు నీయోగి గట్టి కట్టడచేసెను. ఈతని కట్టడికేమి.

ఆ. వె. ఇందుఁ బాసిపోవ నీమ్లేచ్ఛసైనికుల్
కోన వెడలి పురిని గొల్లఁ గొనరె?
వేల దాఁటె నేని విడువడి జలనిధి
పొంగి లోక మొకట ముంచునట్లు.

అయ్యో! నాకేమిచేయుటకుం బాలుపోకయున్నయది.

చ. ఇటుఁ గన రాజ్యరక్షణ, మదేలికధర్మము మానరాదు; నే
నటుఁ గన నార్తరక్షణము, నమ్మల స్త్రీ, యది మానరాదు; నా
కెటు గనుఁగొన్న నేమియు నొకించుక దోఁప దదేమిపాపమో
'ఇటుఁగన నూయి యింకటుల నేగిన గోయి' యిఁకేమిచేయుదున్

అతిమానుషజ్ఞానియగు నీమహానీయుని యానతి మానితినేని హానితప్పదు. కేవలము దీనరక్షణోద్దేశముచేతనే నేనిచ్చోటువాసి విమలయున్నయెడ కేగినను, లోకులుమాత్రము మామోహనాంగిమీఁది వ్యామోహముచే స్వదేశస్వప్రజారక్షణం బుపేక్షించె నితఁడనునింద నాపై మోపక మానరు. ఆహా! రాజన్మాంతము నే నొకలపై దరింపవలసినదే. అదిగాక, సకలసుఖంబులు నిరసించి, మరణముం దృణీకరించి, మేనఁ బ్రాణంబులుండు నంతకాలము కదనరంగంబునుండి కాలుకదల్పకుండుటయే యోధధర్మము. అట్టిధర్మంబు నిదర్శనపూర్వకంబుగ సైనికనికాయంబునకు బోధింపవలసినభారము నాయందున్నయది.

కావున నేది యెట్లయినను, ఇచ్చోటు విడిచిపోరాదు. అయినను నే మును రాజ్యము పోయినను విమలను రక్షింపఁ బ్రతిజ్ఞఁ బట్టియుంటిని, ఏదివేరవు ?

(అంత లోయనుండి సంధిని సూచించుధ్వజమెత్తి సైనికుఁ డొకఁడు పైకివచ్చి)

సైనికుఁడు—గీ. ఉదయపుర రాజ్య లక్ష్మీప యోజమిత్ర!
మత్తరిపుజైత్ర! భారతమాతృపుత్ర!
అక్బరుకుమారుఁ డతిమైత్రి నంపినట్టి
పొత్తుమాటలు గల వివే చిత్తగింపు. 77

ఉ. మీరలుదారమానసులు, మించినవీరులు, వైరికైన స
త్కారము చేయుమేటి సరదారులు, ధీరులు, హింససేయు నా
చారము మీ కులంబున నిజంబుగ నెందునకైనఁ గాన మీ
తీరునఁ దిండి నీ రిడక దీనులఁ జంపుట శూరధర్మమే. 78

అదియటులుండగాక;

శా. ఈలోయంగల యోధులం దరక లెంతేతక్కు వేసున్న నీ
వాలోచింపుము రాజపుత్రకుల సైన్యం బెచ్చు కాన్పించు, ఇ
ట్లేలా చంపెద వన్నపానములు రానీకుండఁగాఁ జేసి? భూ
పాలా! దీనుల నేలుమా యికఁ దరీద్వారంబుఁ దీయింపుమా. 79

మఱియు,

గీ. పౌరుషంబునఁ బోరాడి పగఱఁ బాఁతి
కూల్పఁదగుఁగాక దయలేని కూళరీతిఁ
దిండి నీరీయకుండ వధింప ఘనమె?
ఎన్నటికిని నున్నయది సా వేరికైన. 80

రాజ—(తనలో) పాప మీయక్బరుకుమారుండు దయాళుండగుట మలమలమాడు తనవ శంబులం గని జాలిఁబూని, అతిదీనముగా నీసంధివార్తనంపె. అబ్బా! వీరిదీనాలాపంబు లాలింప నాహృదయము నీరగుచున్నది. (పైకి) ఓయీ! సందేశహరా! మీకభయం బొసంగితిమి. కాని మీయువరాజుగారితో మేమొకపరి ముచ్చటింప వలయును.

సైని— చిత్తము. (పోయి, అక్బరుతోఁబ్రవేశించును.)

అక్బరు— మిత్రమా! మీయౌదార్యమునకు మెచ్చితిమి.

మత్తకోకిల.

మిత్రమా! మది మెచ్చినారము మీదుగౌరవబుద్ధికిన్
శత్రుమిత్రవిభేద మెన్నక సాఁకినట్టి ప్రసిద్ధికిన్
క్షత్రియుం డన నీవె సుమ్ము ముఖమ్ముముం దనుమాటగా
దీత్రిలోకము లెలఁజాలుఁ జుమీ శమాదిసుశీలముల్. 81

రాజ— అక్బరుకుమారా! మీకభయం బొసంగినారము. కాని మేము చెప్పినట్లుగా ఫాదుషావారి కీచిన్నవిన్నపము చేయవలయును.

సీ. తినఁ గట్టుకొన లేనిజనులు మొఱ్ఱో యనఁ
దండపన్ను లుసురు తన్ దగులం ననుము;
విషపుమస్తుల నిచ్చి పృథుసింహుఁ జంపిన
ఘోరపాపము కట్టికుడుపు ననుము;
హిందూమతంబుపై నింతటిద్వేషంబు
మొగలరాజ్యవినాశమూల మనుము;
అనుమానమే తన్ను పెనుభూతమై మ్రింగఁ
జెడుకర్మ కుడుపక విడువదనుము;
రాజపుత్రులతోడి పోరాట తనకుఁ
గదిసి పులితోడ నాడు చెల్గాట మనుము;
దానిఁ జవిఁజూడ నాత్మలోఁ దలఁచెనేని
స్వయముగా వచ్చి పోరాట సలుపు మనుము.

ఇంకను గొన్నిరహస్యము లున్నవి; చెప్పెద రమ్ము. ఇఁక మీ సిబ్బంది యడ్డులేక నేఁడు మాదళంబులలోని రస్తుసామా నుపయోగించి విందారగించి మఱిపోఁ బోవచ్చును. (ఇరువురు నిష్క్రమింతురు.)



## ౬ రంగము—ఢిల్లీలో నొక గోసాయీమఠము.

[యోగియు, పకీరును రహస్యాలోచనము చేయుచుండ
మంజరి ప్రవేశించును.]

మంజరి—ఆహా! చేఁజేతఁ జిక్కిన విమలను మఱలఁ దురకలపాలుచేసితినిగదా! ఆమెం
గొనితురకలు నేనే విమలయని యెంత నమ్మిక పుట్టఁజెప్పినను వినక నన్ను విడిచి
ఆమెనే తీసికొనిపోయిరి. వారి ప్రసంగమువలన నీపురంబునఁ జీకటికోటలో
ఖయిదుచేయుదురని విని యేలాగునైన నెచ్చెలిని విడిపింప నిచ్చటికి వచ్చితిని.
కాని, అబలనగు నా కిది సాధ్యమగునా? కట్టిది. కట్టిది.

(ఆలోచించి) కానిమ్ము ఏది యెటున్నను నా కాఁకలి భరింపశక్యము గాకు
న్నది. ముందీకడ ప్రసాద విచారించుకొనవలయును. ఈమఠములో వండుకొనఁ జోటు
దొరకునేమో!

(పరికించి చూచి) ఇదిగో నాకు మహోపకారులగు యోగియుఁ బకీరు నిచ్చ
టనే యున్నారు ఏమి యదృష్టము! మహానుభావులారా! విమలనెచ్చెలి మంజరి
నమస్కరించుచున్నది.

యోగి—ఏమీ! మంజరీ! ఒంటరిగా వచ్చితివి. నెచ్చెలి యెచ్చట? (పకీరుతో) ఓయీ!
విమలను మంజరి విడిపించెనంటివే?

మంజరి—యోగివర్యా! మీయుపదేశము ననుసరించి మొదట విడిపించితిని. కాని దారి
లో మఱల తురక లపహరించి యిచ్చటి చీకటికోటలో ఖయిదుచేయఁదీసికొని
వచ్చిరి.

యోగి—అన్నా యెంత మోసము! సరియే విచారింపకుము. మేమా మెను విడిపింతుముతే.
(పకీరుతో) ఓయీ! విమల నౌరంగజీబు కంటఁబెట్టకుండఁ గేసరితోఁ గట్టు
దిట్టము చేసివచ్చితివి కాదా?

పకీరు—చిత్తము.

యోగి—మంచిది ఏమీ!

సీ. యోధపురప్రరాణి యూరలే దారాజ్య
మపహరింప సిదియె యదన నటంచు
జ్ఞాతిఁ ద్రుంచ మీ యుఁ గైకొని పాదుషా
వాసి రాజుఁ జేయఁ బూనినాఁడె! 83

ఆహా! మితిమీఱిన వీనిపేరాశ వీనిని మతిలేనివానినిగాఁ జేయుచున్నది. తా
నొక, అనామధేయుని రాజుగాఁ జేయువాఁడట; ప్రజ లంగీకరించువారట!
యోధపురపు రహస్యాను వీరాగ్రేసరుండు తాపసు దుర్గాదాసు తనప్రక్కలో
బల్లెమని యెఱుఁగడు కాఁబోలును.

[అంత పరివ్రాజికావేషముగనున్న యోధపుర వీరమాత పైకివచ్చి]

వీరమా—ఇదియేమి? 'యోధపురము, దుర్గాదాసు' అని యెలుఁగెత్తి యెవరో యఱచు
చున్నారు. దుర్గాదా సిక్కడి కెట్లువచ్చెను? కంఠస్వర మట్లే యున్నది.
అవును దుర్గాదాసే! ఓయీ! తాపసదుర్గాదాసువా నీవు?

యోగి—(ఫకీరుతో) ఓయీ! మంజరియు నీవును లోనికిఁజని యగ్నిహోత్రములను
సిద్ధము చేయుచుండుఁడు, ఈమె యెవ్వరో నన్నుఁజూచి భ్రమపడినది. విచా
రించి వచ్చెద.

మంజరి } చిత్తము. (నిష్క్రమింతురు.)
ఫకీరు }

వీరమా—ఓయీ! తాపసదుర్గాదాసువా నీవు? అణుమాత్రమయిన గుర్తింపలేనై
తిని. ఇదియేమి యీవేషము?

యోగి—దేవీ! యోధపురేశ్వరీ! నామాట కేమిగాని నీ రిచ్చట కీరూపంబున రాఁ
గారణంబేమి?

వీర—తీర్థయాత్రకుఁ గాశికి బోయి, బాలుని కుశలోదంతంబు లెఱింగి రా నుదయపురం
బున కరిగిన పురోహితుని సమాచారము తెలియరామిఁ గుమారుంజూడ నుదయ
పురంబున కీప్రచ్ఛన్నరూపంబునం బోవుచుంటిని.

యోగి—దేవీ! చిరంజీవులగు కుమార మహారాజావారు మేనమామగారియింట నిగపూ
వాడక పెరుగుచున్నవారు. పాపము! మనపురోహితుండు సుశర్మ మ్లేచ్ఛుల
చేతఁ బడి మడిసెను.

వీర—అయ్యో! సుశర్మ గతించెనా? ఎంతపాపము, హరహరా! ఆధరామయుని దారు
ణమరణంబునకు నేనే కారణమైతినా!

యోగి—దేవీ! విచారింపకుఁడు. దీన మీదోష మేమికలదు? ... ... ...
కుమారుని క్షేమసమాచారము లెఱింగియుండియుఁ బంపక యింతకాలము జాల
ముచేసినందుకు క్షమింపవలయును.

వీర—పోనీ! దీనికేమిలే! ఎచ్చటనైన సుఖముగా నుండినంజాలును. ఓయీ! యోధ

పుత్రవీరాగ్రేసరా! పిఱికికండలేని పోటుమానిసివి. నీవును, యీ యలంఘ్యు పరిపాలన భయకారణమైనదా? ప్రచ్ఛన్నవృత్తిని సంచరించుచున్నావు!

యోగి—అమ్మా! ఇది భయముచేఁ బూనినవేషముగాదు. నాఁడు మీతో రాజస్థానము నిర్మనుష్యంబుగాఁ జేయ శపథంబుఁబట్టితినే. అది మొదలు నేనిట్లే సంచరించుచుంటిని. తల్లీ! దానికేమిగాని తమ రిచ్చటనుండిన నొక దీనురాలిం గాపాడఁగలిగియుందునుగదా యని యిప్పుడే తలపోయుచుంటిని. ఇంతలో దైవానుగ్రహంబున "అడబోవుతీర్థ మెదురాయె" నన్నట్లు తమ దర్శనలాభంబుగలిగె.

వీర—ఏదీనురాలి ప్రాణరక్షణము నేఁ జేయవలసియున్నది? వేగఁ జెప్పుము?

యోగి—దేవీ! చూచితిరా! అలకాపురంబువలె నపూర్వగోపురపుమాత్రరంబై, సిరులకుఁ గాపురంబై, సుఖములకు డాపురంబై, మొగలాయీసామ్రాజ్యలక్ష్మికి నాపురంబై మాపుమేర దూరంబున నాపట్టు నాపురగోపురంబే ఢిల్లీపుర గోపురంబు.

లయగ్రాహి.

కొమ్మ! కనుఁగొమ్మ జలదమ్ము తనుఁ గ్రమ్మ శశి
కిమ్మొసఁగ జాలి గగనమ్ముఁ గనుకోటల్
కమ్మనగు తెమ్మెరల కిమ్మయి సతమ్ముఁ గుసు
మమ్ములను జిమ్మ నగరమ్మ విరిదోఁటల్
దొమ్మిగ గజమ్ములు హయమ్ములు రథమ్ములిరు
గొమ్ములను గ్రమ్మఁ జన నిమ్మగని బాఁటల్
నెమ్మది ముదమ్మొసఁగు సుమ్మిది పురమ్ములఁ గ
రిమ్ము సుఖదమ్మగు పురమ్మని తలంతున్. 84

వీర—అవును. ఈఢిల్లీపురం బెంతయు శోభస్కరముగానే యున్నది. కాని, ఆదీనురాలి సంగతియేమి?

యోగి—దేవీ! మనవిచేయుచున్నాను.

ఉ. అల్లదె! చూడు మా దెసను నాకస మంటుచు వల్లుకొన్న యా
నల్లని చెట్లచాటునఁ గనంబడు సౌధ మొకండు, వంపఁగాఁ
జెల్లదు లాతివారల వసింతు రలంఘిరుస్త్రీలు గావునన్
మెల్లగ మీర లందుఁ జని నేఁ డొకజవ్వనిఁ బ్రోవఁగావలెన్. 85

వీర—ఓయీ! ఆదీనురాలగు మానిని యెవ్వరో యెఱింగింపవేని, ప్రచ్ఛన్నంబున నేల, బహిరంగముగ నేపోయి మ్లేచ్ఛరక్షకభటుల శిక్షించి, ఆమచ్చెకంటిని విడిపించికొని వచ్చెద.

యోగి—దేవీ!

గీ. ఆయమ యమరసింహు ద్వితీయపుత్రి
విమల, సోదరిచేఁ జెఱఁ బెట్టఁబడియె;
మీకుఁ గాఁబోవు మఱఁదలు, మిగుల వెతలఁ
జెందుచున్నది వేగ రక్షింపఁ దగును. 86

వీర—ఓహో! విమలయా! ఆ సారసాక్షి రక్షణం బవశ్యాచరణీయంబే. ఇదే పోవుచున్నాను.

యోగి—దేవీ! ఇది సరిగాని—

క. ఇది వైరిజనుల కిమ్మగు ప్రదేశ
మిటు చనఁగ నెగ్గు వచ్చునో యేమో;
సదమలమగు పురుషాకృతి
నిఁ దగంగొని యేగుమమ్మ నీరజనేత్రా! 87

ఇవే దుస్తులు- ఇవి మీసోదరుండగు రాజసింహునివి. అతఁ డొకపరి వీని నొక కారణంబున నాయొద్ద డించిపోయెను.

[దుస్తులీయ ధరించుకొన వీరమాత లోనికిఁ బోవ నొకచారుఁడు ప్రవేశించును.]

చారుఁడు—రామ్. రామ్. (నమస్కరించును.)

యోగి—ఓయీ! నీ వారావళికొండకనుమనుండియేగదా వచ్చుచున్నావు?

గీ. అట దరి న్నిల్చి రాజసింహాంబు యవన
వాహినీగజములు వెలువడక యుండఁ
గాచియున్నదె మిగుల జాగ్రత్తతోడ?
యోధుఁ డా దిలేర్ఖానుఁ డెందున్నవాఁడు? 88

చారుఁడు—స్వామీ! రాణావారు లోయచెంత నప్రమత్తులై యున్నారు. ఇంకను దిలేర్ఖాను సిబ్బందులు కలియుచేను. అక్బరుకుమారుండు సంధిగోరఁగా రాణా

వారు మొగలాయీసిబ్బందులకు నిన్ననే దారి నొసంగినారు కాని మఱియొక్క ఘోరవార్త వింటిని. చెప్ప నోరాడకున్నది.

దుర్గా—ఏమా దుర్వార్త ?

చారు—ఆర్యమతవిరోధియగు నామ్లేచ్ఛచక్రవర్తి జగద్విఖ్యాతమగు కాశీవిశ్వేశ్వరాలయము నేలపాలుచేసి యందలి సువర్ణలింగం బపహరించెనఁట.

దుర్గా—హర! హర! (చెవులుమూసికొని) హతోస్మి! హతోస్మి! హా! (కూలఁబడి మెల్లఁగలేచి) హా! దుష్టా! దుర్బుద్ధీ! తులువా! దుర్వర్తనా! ఎంత పనిచేసితివిరా! ఓరోరి చెనఁటీ! ఈ చెడుబుద్ధి నీచేటుకాలమునకే పుట్టినది సుమా! లేకున్న జగత్ప్రళయంకరభయంకరాకారుఁడగు సాక్షాద్విశ్వేశ్వరునికే యపచారము చేయసాహసింతువా! ఎంతపని! ఎంతసాహసము! ఎంత మదోన్మత్తత! ఎంతపొగరుఁబోతుఁదనము! విగ్రహాంతకుల మగుదుమని పంతముఁబట్టి మూరెడుపొడుగు బారెడు కుంగిన నీపూర్వికులచరిత్రలైనను నీకు స్ఫురణకు రాలేదురా! దురాచారపరాయణా!

సీ. సోమనాథునిగుడి భూమిపాలొనరింప,
గజనీకి నిజకులక్షయము గాదె;
కాశీవిశ్వేశ్వరుఁ గాలఁ దన్నఁ దలంప
గోరీకి కులమెల్లఁ గూలిపోదె;
గోద్విజాలికి గోడుఁ గూర్చిన మహ్మదు
తుగ్లకు మతి చెడి తూలిపోఁడె;
హనుమద్విగ్రహముఁ గూల్చిన ముజాహిదుషాహి
భూసురశాపాగ్ని బుగ్గి గాఁడె;
నేఁడు విశ్వేశ్వరునిగుడి నేలఁ గలిపి
శ్రేయమందుదె నీవు చూచెదము గాక
రమయు రాజ్యంబు భిన్నభిన్నములు గాఁగ
నిఖిలసంపత్తితో నశించెదవు గాని. 89

కానీ! మత్సరబుద్ధిచేతనో నీతుచ్ఛమ్లేచ్ఛబుద్ధిచేతనో దేవాలయముం ద్రోయించి

లింగము నపహరించితి వింతమాత్రమున నార్యమతము నశింపుననుకొంటివా? కాశీమహాత్మ్యము తగ్గుననుకొంటివా!

మ. దురహంకారముచేత దేవళములం దోత్రియింతు త్రోత్రియింతు పో
తురకల్ కాళ్ల నుగ్రమ్మవిగ్రహములందొక్కింతు త్రొక్కింతు పో
వరనిష్ఠోత్కటనిష్ఠులౌ ఋషికలాపస్థాపితంబై యున
శ్వరమౌ నార్యమతాద్రి లేశము మెదల్పం జాలుదే చచ్చినన్?

అదే వీరమాత పురుషవేషమున వచ్చుచున్నది. ఈమె స్వమతావేశమున ప్రస్తుతకార్యము పేక్షించుఁ గావున నిప్పటికి విశ్వేశ్వరాలయవృత్తాంత మీమెకుఁ దెలియకుండ మఱుగుపఱచెదను.

వీర—(పురుషవేషమునఁ బ్రవేశించి) ఓయీ! నే నింకఁ బోవచ్చునా?

యోగి—(తనలో) ఈమె మూడుమూర్తులు రాజసింహునివలె నుండి నన్నే చేసినది. (పైకి) అమ్మా! సత్వరమ్మగ దీనరక్షణికై రమ్ము. ఆమెను వెనుక తమ రామెతో మన్యమార్గమున నుండుఁడు. దర్శనమానరు వచ్చె

(నిష్క్రమింతురు.)

వీక్ష మాటికిఁ దీనురాలి

---

## ౬. రంగము—చీఁకటికోట

[నసారాలో గులామును, మహ్మదాజియును బ్రవేశింతురు.]

మహ్మ—అరె! గులాం. నేఁజా రాజపుత్రుల్లాగ లాయక్ నే మాట్లాడుతున్నాక లేదుర? అయిన్లా మాకీ నిఖానేయడాన్కి యెందుక్ యేసుస్తావి?! మాకీ అందమ్ సందిమ్ యేమీతక్వా? ఇఁక మావీబలం యేన్నాబలమ్ నాతో కుస్తీసెయ్యడాన్కి జయపూర్, జోద్పూర్, ఉదయపూర్, మిథునాపూర్, ఢిల్లీ, అజ్మీర్మే ఏఆద్మీ, ఏఫయిల్మాన్, ఏవస్తాద్ వస్తాడో రమ్మన్, బ్రిస్తీమేసవాల్.

గులామ్—అచ్ఛామహారాజ్! నీదిబలమ్ పందీబలఁ దున్నపోత్ బలమ్.

మహ్మ—మరీ దేఖో! ఇప్డు పాదుషా మాకీ యెంతగౌరవమ్ సేస్తాడ్?

గులామ్—నిజమ్సర్కార్ - పాదయేస్నా పులావ్ మీకేయుస్తాన్. మునుపు మాకీ యిచ్చీవార్.

మహ్మ—ఇంకామటియేమినూసినావ్? కేసరీబేగమ్ మున్ప మాకేసి తోడాతోడా గోసాసేనేది. ఈయిప్లా వచ్చినవాడ్నుంచి సర్వదుంబాలా. జనానాఖానా

హేరంగీరం ఏవీ! అడ్డూలేదు. ఇప్పే యిమ్లీదగ్గిర్కి పోవాల్. నేను అచ్ఛా లాయిక్ వున్నానా లేదా సెప్పు.

గులామ్—అచ్ఛా దేఖో! బల్ భేషుక్, నీపోషక్. నీయేషం నీమీషం- నీహుకా నీటెక్కు, నీరూపం, నీయేషా యేరాచవాన్కి వుంది సర్కార్?

మహ్మ—అచ్ఛా! రా! యిమ్లీదగ్గిర్కి పోదామ్. (పోవుదురు.)

(తెఱయెత్త లోపున విమల ఖిన్నవదనయై శోకించి కూర్చుండును.)

విమల—(తనలో) హా! దీనబంధూ!

చ. కటకట! దైవమా! జననకాలవిశేష మదేమొ? పెక్కుసం
కటముల కిక్కనైతి ధరఁ గాలిడనేర్చిన నాఁటఁగోలె; నా
కు గతియేమి? యే నెటుల నీవిషదంబుధి దాఁటనేర్తు? ఈ
లయునందు వ్రాసితివె నీచుల చేఁబడఁ బాపపున్ విధీ!

బట్టి వక్కటా! తల్లిగర్భంబునుండి యెట్టిశుభముహూర్తంబున భూమిపైఁ బడితినో కృడమిపైఁ బొడమిన గడెయైన గడువకుండ, పడరాని కడగండ్ల నెడలేక పడుచున్నదాన. వృద్ధులగు జననీజనకుల ఘనతరవిచారవారాశిం గూలఁద్రోసి, క్రూరురాలగు సహోదరి తనయున్న యధికారగర్వంబున మిన్నుమన్నుఁ గానక, పాలుమాలి, జాలిఁదూలి, తూలిపడుచు, ప్రజ్వలితహుతాశనకీలల న్నిరసింపఁజాలు పరుషవాక్కులలంగ్గశూలములలీలం గీలుకొలిపి, మదీయమనోమహీరుహంబు దహించి, భసీకృభూతంబు గావించి, యింక నపకరింపనున్నయది.

కటకటా! కఠినురాలగు నీకుటిలకుంతల యంతరంగంబను నిఘంటువునందు దయాదాక్షిణ్యాదులను రెండు పదంబులు ప్రక్షిప్తంబులు కాఁబోలు. అయ్యో! మందభాగ్యురాలనగు నాకు సాయముచేయవచ్చిన నెచ్చెలి మహారణ్యమధ్యంబున నటు మాయమైపోయె. అక్కటా! నాకునుంగు సంగడికత్తె క్రూరసత్వకగణ్యంబగు నా మహారణ్యంబున నేమయిపోయెనో గదా! దయామయా!

[గులాం ప్రవేశించును.]

గులాం—ఇమ్లీ! జోడున్నార్ ఛోటాసర్కార్ మహ్మానాజీరాజ్ వస్తావున్నార్.

గీతిక. దేఖో నేడే నీకీ నిఖా సేస్తార్
లేఖుంటె ఆఖర్కి జులుమ్ సేస్తార్

అడ్గూ కేసరీబాయి ఆజ్ఞ యిచ్చార్
పిడ్గూ కేమూఫక్ బల్ పేచీ తెచ్చార్. 92

(వికారముగా గంతులు వేయుచుఁ బాడును.)

విమల—కటకటా! కఠినవిధీ!

చ. ఒకదెస నీగులాము కఠినోక్తులు పల్కుచు 'నెద్దుపుండు కా
కికి సరకే' యటన్నగతిఁ గేరుచుఁ ద్రుళ్లుచు గంతులాడ, నిం
కొకదెస నాపిశాచి పుయిగోడక తప్పరియింపఁగోర, న
న్నకట! విరోధిమధ్యమున నంగదలం గుమపించుచదే విధీ. 93

అక్కటా! ఈకోకిలికి వేసంపు గులాపుగాడిద మత్తేభ ఒక్కదిక్కున వెక్కసంబులాడ, ఆముష్కుడి టక్కరిరాజపుమాయనివలె నటించుచు మాటి మాటికిఁ దన్ను వరింపుమని మిక్కిలి చిక్కులంబెట్టుచుండ నీదిక్కున దిక్కుమాలిన దీనురాలి పోలిక నుండుమని నాఫాలతలంబున వ్రాసియుంటివే విధీ! హతవిధీ!

[అంత మహమ్మదాజీ ప్రవేశించును.]

మహ్మ—అరే! గులాం! ఆడవాళ్ళతో మాట్లాడాన్కి మాకీ సాలా మొహమాటం. మాకీ నిఖా సెయ్యడాన్కి దీన్కి సిపాయ్స చేయి. నీకీ మంచి యినామ్ యిస్తామ్.

గులాం—అచ్ఛామహరాజ్! మీకీ మెహర్బానీ మాకీ పూరావుంటే యినామ్కీ యేమీ తక్వా? అవస్యం మీకీ యిష్టాకి సాసాయింపుచేస్తామ్. అవ్ మహరాజ్!

మహ్మ—మరీజావ్! (కొంచెముసడచి) అరే! మాకీ తోడా తోడా మొహమాటమ్ యేస్తావే. మాకీ ఆసాకీ జరూర్ లేకుండా బందోబస్తుచేయి.

గులాం—క్యా! సర్కార్! పెళ్ళికొడుక్కులేంపే పెళ్ళి! మంచిమాట సెప్పెనావ్! రా మహరాజ్! పర్వాలేదు. (చేయిపట్టుకొని లాగును.)

మహ్మ—ఛాఫ్! ఛోడ్దేవ్! వస్తామ్వుండూ! పెళ్లీకి యెల్లటం మజా నీకీ యేమితెల్సున్? (వెనుకదీయుచుండ గులాము బలిమినిఁదీసికొని పోవును.)

విమల—అదిగో! ఆముష్కుడు లీదిక్కుననే వచ్చుచున్నారు. ఇఁక నేమిచిక్కులంబెట్టుదురోకదా దైవమా!

కవిరాజవిరాజితము.

పరమదయాకర, భవ్యగుణాకర, పాలనఁ జేయర పాపహరా!
శరణు మహేశ్వర, శర్వ, సురేశ్వరసన్నుత, శంకర, చంద్రధరా!
దురితవిదారణ, దోషనివారణ, దుష్టనిశాచరదోర్దమనా!
పరిపరిబాముల బాళినిఁ బొందెడుబాలను నావెత బాపు హరా!

మహ్మ—బలే! బలే! ఎంతతమాసాగా పాడుతూందిరా పెళ్లికూతురు!

గులాం—గానాసై మహరాజ్! దివానారోదన్ సేస్తుంది.

మహ్మ—చూపావ్? అది హాకరకం శోకం. నీకీ జనానా సంగీతకం మజాయేమీ తెల్సునా? ఇదే మంచిహవకాషం. జావ్. జల్దీ నామాట సిపార్సుచేయి.

గులాం—అచ్ఛాసర్కార్! (విమలతో) ఓసీ! దయ్యంనేదూసైతాక్ నేదు. పెద్దామనిషి పెళ్లికొడ్కూ హద్దావచ్చార్. బుద్ధిగాయిను. మాఛోటాసర్కార్ ఝూడ్వార్ జస్వంతసింగ్కా బేటా. చూడు! ఎంతడాబు! ఎంతదర్పం! ఎంతహాయల్! ఎంతడవుల్.

విమల—హా! జగదీశ్వరీ! ఈకొఱమాలిన కూళ్రుల దురాలాపంబులు వినఁనోప.

ఆ. వె. చెవులలోఁ దుపాకిఱవల పోలికఁ జొచ్చి
మొదవు దూసె గాని మేననుండి
ప్రాణములనుదీయు వక్కటా! యీనిష్ఠు
రోక్తు లెంత మొండియుసురొ నాది! 95

మహ్మ—అమ్మా! (కాలుకఁగఱమకొని) నై! నై! తక్సీర్మాఫ్. అమ్మాయీ యిప్లో నేను యోధాపురంరాజు జస్వంతసింగు కుమారుణ్ని. రాజపుత్రుణ్ని కాను. రాజపుత్రుణ్నే. అనుమానం మాను. పెళ్లీసేసుకో. నేనే రేపు యోధాపురం మహారాజునైపోతాను. రా! పెళ్లీసేసుకో.

విమల—ఓరీ మొద్దా! నీకు పెండ్లికావలెనా? నీవు రాజపుత్రుఁడవా? 'తలపరువునోరే తెలుపు' నన్నట్లు నీనోరే నీగుట్టునట్టెల్ల బయులుపెట్టుచున్నదే. తలపుమించిన పోకడలకుఁ బోక నీదారిని బొమ్ము. తేకున్న నీకుఁ జెప్పినవారికిని నీకును బుద్ధివచ్చునట్లు చేసెదను.

ర గ డ.

తొలఁగి చనుమటు, తులువ! వినుమిటుతలతుమించిన పసుపులెందుకు?
వలదు నీ పరువునకు నమఁగని వలపుఁ జెదకు, పగలఁ బొందకు;
తలఁపఁగను తలపరువు నోటనె తెలియనగు నొక చిన్నమాటనె;
తొలఁగవే న్వను మొక్కవేఁటునఁ దొలఁగఁజేయుదు తెప్పపాటున 98

[అంతఁ గేసరీబాయి ప్రవేశించును.]

కేసరి—(చటాలునవచ్చి) ఓసీ! ధూర్తురాలా! గయ్యాళిఁగంపవై, యేమే నీకాఁబోవు భర్తం దూఱుచున్నావు అశం దెవ్వరనుకొన్నావు? యోధపురకుమార మహారాజు. సుకుమార మారకుమారాకారుఁడు.

విమల—ఛీ! ఛీ! సిగులా రా! నాయెడబునవసు రానుము. మచ్చలేని యుచ్చపురాట్కులంబను చందనవనంబున గచ్చపొదమచ్చునఁ బుట్టిన తుచ్ఛురాలవు.

కేసరి—ఏమేమీ! చింతవచ్చినను పుల్లయింకను జావకయున్నదే. పోనీ; నామాటకేమి లే. నీవీమదనమోహనమూర్తిని, యీదివ్యసుందరాకారుని, యీయోధపురరాట్కుమారునిం బరిణయంబయి, తత్కీర్తికాంత దిగంతకీర్తనీయంబుగా రాట్కులంబెల్ల నిష్కళంకంబుగాఁ జేసి నాభర్తను బరాభవింతువుగానిలే.

విమల—ఓసీ! దుర్మతీ! ఇల్లలికినంతనే పండువకాలేదు. ఇంతమాత్రమునకే హేళనమేల?

కేసరి—పండుగయైనది కనుకనే హేళనము.

విమల—అప్పుడేమైనదా! కేసరీ! తొందరపడకుము. విదియనాఁ డగపడనిచంద్రుఁడు తదియనాఁ డగపడక మానఁడు.

కేసరి—తొందరెందుకు. ముందున్నది. ముసళ్ళపండుగ! చెల్లెలా! కోపమేల? ఎంతయో ప్రయాసపడి నీకీసంబంధము కుదిర్చితిని. ఇటు చూడు. పెండ్లికొడుకు నీకుఁదగినవాఁడేనా? సిగ్గేల? వెళ్ళి యొడిలోఁ గూర్చుండుము. మేముంటిమనియా సిగ్గు? మేము పోదుమా! గులాం! రా.

విమల—ఓసీ! కేసరీ! నే నిపు డిట దైన్యపడితినని పరిహసింపఁబోకుము. చీకటి వెనుక వెన్నెల రాకమానదు. నీయేపు రూపుమాపు నేవీరభూరుషుండు నాపాణిఁ బట్టనున్నవాఁడో యెవరికెఱుక? నీనుదుటను నే పొద్దుపొడువలేదు గదా?

కేసరి—ఏమేమీ? నిన్నుఁ జేపట్టు రాపట్టి యీపట్టున నే కలఁడు. నీయట్టిరజ్జులాడియే పట్టిముద్దపెట్టిన నట్టివంకరయే చూచినదఁట. పోనీ! నీయనుమానము నేనే తీర్చెదనులే. (మహమ్మదాజితో) అయ్యా! యోధపురేశ్వరా! ఇదే మదీయసహోదరి యగు నీవిమలను మీ కిప్పుడే కన్యాదానంబుగా సమర్పించుచున్న దానను. కావున దయచేసి పాణిగ్రహణంబు చేయుఁడు.

మహమ్మ—(సిగ్గుచే తలవంచుకొనును.)

కేసరి—అయ్యా! సంకోచింపకుఁడు. మీ యౌదార్యమునకుఁ దగినదియే. (విమలతో) సోదరీ! ఏదీ నీహస్తము? ఒప్పగింతపెట్టెదను.

(అని హస్తమును బట్టుకొనఁబోవును.)

విమల—ఛీ! ఛీ! దుష్టురాలా! నన్నంటఁబోకుము.

ం చ చా మ ర ము.

దురాత్మురాల! ముట్టరాకు దూరముండు మట్టె! నీ
శరీరమందుఁ, బ్రాణమూన స్వాంతమందు నెంచితేన్
కేసరి—ఉరో! యొకైన చీమకన్న మున్నుఁ జూడుఁ డీతొరన్
జొరన్వలెన్ భయంబు పుట్టె శూరురాలి మాటకున్. 97

ఓసీ! వగలాడీ! తాటియాకుల చప్పుళ్ళకుఁ గుందేళ్ళు జడియవు. ఇఁక నీయాటలుఁగట్టిపెట్టి నేఁ జెప్పినట్లు వినుము. లేకున్న నీతల కోటకొమ్మునకుం గట్టించెద. (బలవంతమున విమలచేయిఁ బట్టి మహమ్మదు చేతిపైఁబెట్ట సమకట్ట వాఁడు సిగ్గుపడుచుండును.

విమల—(చేతులు జోడించి)

మ. అకటా! కావఁగ నిద్దియే తఱి మదంబా! దీనసంరక్షిణీ!
అకలంకఁబగు భక్తి నీపదము లత్యాసక్తి నర్చించు నా
దుకరాంభోజము లీమె యీసుఁగొని యీదుర్బుద్ధి, దుశ్శీలుఁ, డొం
డి, కుజాతుండగు నీచు కేల నిడుచుండెన్ బ్రోవుమా! యీశ్వరీ! 98

[అంత వీరమాత పురుషవేషమునఁ బ్రవేశించి]

వీరమా—(కేసరితో) ఓ హింసకారీ! కేసరీ! నీపాపకూపంబు నేటికిఁ బరిపూర్ణముగా నిండినది. ఇఁక నొక చుక్కయయిన భరింపనోపదు. (మహమ్మదాజీతో) ఓరోరి కష్టుమష్టింపచా! నీకా విమల పాణిగ్రహణము కావలయునా? ఇదే నిన్ను

వరియింప ముక్తికాంత యెదురుచూచుచున్నది. కేసరికూడ నిన్నత్తవారింటికి కంపకము పెట్టునులే. ఓసీ! దోషకారి! కేసరీ!

ఉ. ఓసి దురాత్మురాల! యిటు లోర్వఁగలేమినిఁ దోడఁ బుట్టునే
గాసిఁ జేయ గారవము గల్గెనె; కేసరి యన్నపేరు నీ
కే సరి దోషకారి! యిదె యీనిశితాసిని వేణిఁ గోసి ని
న్కేసరిఁ జేసెదన్ దుడుకుఁ జేసిన దోసము మాసిపోవునే. 99

కేసరి—(అచ్చెఱుపాటుతో) ఆ! ఏమిది! పోతుటీఁగ కేనియుఁ జొఱరాని యీమందిరంబున కీపురుషుం డెట్లు రాఁగలిగె! ఇఁక నిచ్చో వసించిన హాని తప్పదు.
(పోఁబోవును.)

వీర—ఓసీ! కేసరీ! ఎందుఁ బోయెద నాఁగుమాగుము. ద్వారములన్నియుఁ బంధింపబడినవి. వ్యర్థప్రయత్నములు చేయకు. ఇదే నిన్ను వధించుచున్నాను. దిక్కుఁ గలవారిని వేఁడుకొనుము. (అని కత్తిచేఁ దెగవేయఁబోవును.)

విమల—(అడ్డునిలిచి)

పంచ. ఓహో! పరోపకారబుద్ధి నోమహా దయాంబుధీ!
అహంకృతిన్ క్షమించి దీనురాండ్రి మాదరింపుమా
మహోపకారి యయ్యు నీవె మామకాపురాలె యా
సహోదరీవధంబు గాంగ జాల క్రోధ మాపుమా. 100

వీరమా—విమలా! నన్నాపకుము. ఎత్తినకత్తి రిత్తవుచ్చుట క్షత్రియోచితంబు గాదు.

విమల—మహానుభావా! అట్లయిన మీకరవాలంబునకు నన్నాహుతిం జేసి వైరి మీచిత్తము వచ్చినట్లు చేయుఁడు.

వీరమా—ఓసుందరీ! నీయందలి వాత్సల్యముచే నీఘోరపాతకి నిప్పటికి విడిచిపెట్టితిని. ఇఁకఁ బోదుమురమ్ము. (కేసరితో) ఓసి కేసరీ! నీచెల్లెలిదయవల్లను, నీతల్లికడుపు చల్లఁదనమువల్లను బ్రతికిపోతివి. ఇఁక మంచయిన బుద్ధిగానుండుము. విమలా! పోదము రమ్ము. (నిష్క్రమింపఁ దెరజాఱును.)



శ్రీ

# రసపుత్రవిజయము

## చతుర్థాంకము.

### 1. రంగము—యోధపురమునకుఁ బోవుమార్గము.

[యోగియు, రాజసింహుఁడును, అజితసింహుఁడును ప్రవేశింతురు]

రాజ—స్వామీ! మొన్న యోధపురీపురోహితునివేషంబున మన యజితసింహుని వంచింప వచ్చిన యామ్లేచ్ఛుఁడు చిరంజీవి కిచ్చిన యుత్తరములలో నిదియొకటి. దీనిం గూర్చి మీయభిప్రాయ మేమి?

యోగి—(చదివి చూచి) మిత్రమా! ఈ యుత్తరము నే నమ్మఁజాల.

మ. అతిమాయావి యలంఘిరీసునసుతుం డాత్మీయులన్ వీడి రా
ట్సుతులం జేరె, జయింపరాదనుచు నీమం డిట్టి దుర్లేఖ దు
ర్మతి సృష్టించెను, కాని యిప్పరిటు దౌర్జన్యంబునుం బూని దు
ష్కృతముం జేయఁగ సాహసింపఁడని యూహింతున్సుమీ! మిత్రమా!

ఇది యంతయు నలంఘీరు స్వకపోలకల్పితము. దూరాలోచన లేని వారి దురాలోచనలు మన మెఱింగినవే కదా?

ఉ. ఉత్తరమంపె లోన నిటు లున్నవి లేనివి కొన్ని వ్రాసి, పై
నుత్తరమందుఁ బుత్త్రికున కుత్తవిలాసము వ్రాసి, దాని నీ
జిత్తులమారిచే మనకుఁ జెందఁగఁ జేసె, నిజమ్ము; వీని యీ
యెత్తులు క్రొత్తలే మనకు, నెన్నఁడు చూచుచునున్నవే కదా 102

రాజ—స్వామీ! అయినచో నక్బరుకుమారుం డీసమాచారము వినినతోడనే సౌరాష్ట్రదేశంబునకుం బాఱిపోఁ గారణం బేమి?

యోగి—తండ్రి క్రౌర్యమునకు న్వెఱచియో, మన యౌదార్యము మఱచియో; దాని కేమిలే. మొన్నటి యాబ్రాహ్మణరూపమ్లేచ్ఛుం డెంతటిద్రోహము చేయ సాహసించి వచ్చె ననుకొంటిరి! దైవానుగ్రహముకల్మి మన మింతలో మేలు కొనఁబట్టిగాని లేకున్న నీ చిన్ని మేనల్లుఁ డీపాటికి ఢిల్లీలో ఖైదీగానో, లేక—

రాజ—ఆహా! యెంతద్రోహ మెంతద్రోహము! స్వామీ! మీఋణము మే మాజన్మ
దాస్యము చేసియుఁ దీర్చుకొనఁజాలము.

యోగి—ఇందులో మే మొనర్చినదేమున్నది.

ఆ. వె. బాలు ప్రాణముఁ గొన బందుగు దట్టించి
గుడినిఁ బెట్టి కాళ్ళు తడి యెత్తిఁగి,
వానిచేత వానిప్రాణముల్ కొని వానిఁ
దీసికొన్న గోతఁ ద్రోసి తీవ్రు. 103

(అజితసింహునితో) బాలకా! ఆబ్రాహ్మణరూపచండాలుని విశ్వసించి, వాఁడు
పిలిచినంతమాత్రమునఁ బోఁదగునే!

ఉ. చిన్నికుమార! యట్లొకఁడు చేరఁగనే యిలుదాఁటి యొంటిగా
మిన్నక మోసగాని చెలిమింగొని వచ్చుట మంచిదయ్యె! వా
ని న్నిజమైన విప్రుఁడని నెమ్మది నమ్మితివయ్యె! అయ్యొ; నీ
కెన్నఁడు లేనిబుద్ధి జనియింపఁగఁ గారణ మేమి తెల్పుమా? 104

అజిత—సాధువర్యా! నాబుద్ధిలేమికి మన్నింప వేఁడెదను. ఆవంచకుండు తాను మాపు
రోహితుండనని నమ్మిక పుట్టఁజెప్పి—

ఆ. వె అమ్మగారు పంపిరని వార్తలం దెల్పె;
నమ్మకున్న నొక్కకమ్మఁ జూపె;
మామగారు రాఁగ మనవిచేసెద నన
వ్యవధి లేదు జనని బ్రతుక దనియె. 105

యోగి—వాఁ డామోఘపుర పురోహితునిఁ జంపి, ఉత్తరములను సంగ్రహించి చేసిన
మోసమా యిది! కానీ ఆమోసగానికిఁ దగిన శాస్తి యయినదిలే. రాజసింహా!
ఇఁక నొక యామముపైఁ బ్రయాణములో గమ్యస్థానముఁ జేరఁగలము. అజితసిం
హా! నీవు నడువఁజాలవు. మే నాపయి నెక్కుము.

అజిత—స్వామీ! చక్రిని యీచక్కఁగల చక్కఁదన మెంత చూచినను నాకుఁ
దనివి తీఱకున్నది. కావున కొంచెముదూర మీతీరున నే నడువ సెలవిండు.

యోగి—అయిన నీయిష్టము కుమారా! మన మిప్పుడు మేరుపర్వతోన్నతప్రదేశము
మీఁదఁ బోవుచున్నాము. ఎక్కుడగుటచేఁ గాళ్ళు నొప్పిపెట్టునేమో యని
యట్లంటిని.

అజిత—స్వామీ! నాకుఁ గాళ్ళు నొప్పిలేదు.

గీ. పట్టుమని పదియడుగుల నిట్టె నడచి
నానొ, లేదొ, కాల్నొప్పి నా నవ్వి పోరె;
ఇంతసుకుమారమైన నెటు జయింతు
జనకుఁ జంపిన ఘామసాన్ సంగరమున? 106

రాజ—(చెక్కిలినొక్కి ముద్దాడి) కుమారా! నీవు తప్పక సిద్ధసంకల్పుండవయ్యెదవు.

యోగి—రాజసింహా! చూచితివా? నీభాగినేయుని పౌరుషము.

తే. గీ. వడి శిశోదయ రహాతూరువంశము లను
దారువ్రలు రెండు రాపాడఁ దగజనించి
నట్టిదావాగ్ని గాఁడె నీయల్లుఁ డనఁగ,
యవనవనదాహ మొనరించు టబ్బురంబె! 107

రాజ—స్వామీ! ఇదంతయు మీయాశీర్వచన పరిభావమే గదా!

అజిత—స్వామీ! ఇది మేరుపర్వతప్రాంతమనిగదా యంటిరి.

(వ్రేలితోఁ జూపుచు)

ఆ. వె. సొబగు మీఱి మేడసోపానములమీఁదఁ
బరచినట్టి పట్టు పరుపసంగఁ
గానిపించు నదిగొ కనుచూపుమేర నీ
పైఁడికొండమీఁది పైర, చెపుడీ? 108

యోగి—కుమారా! అట్లనే.

అజిత—ఆహా! ఈకొండచెలిక లొకదానికన్న నొకటి యెత్తుగానుండుటచే బంగారు మలామాచేసిన మెట్లవరుసలవలె నెంత శృంగారముగా నున్నవి! ఇందుచేతనే కాఁబోలు దీనికి మేరుపర్వతమని పేరువచ్చినది.

యోగి—అజితసింహా! దీనికి మఱొకకారణ మున్నది.

ఉ. భారతభూమిమధ్యఁగల పర్వతరాజములందు నున్నతం
బై రహిమించుటం దొలుత భాస్కరుతేజము తన్నెతాఁకి బం
గారపునీరు పోయుగతిఁ గ్రాలుచు నుండుట నీనగం బిలన్
మేరుసమాఖ్య రంజిలుసుమీ విమలాన్వయ రాజనందనా! 109

రాజ—మేరుపర్వత మని పేరువచ్చుట కిదియా కారణము!

అజిత—యోగివర్యా! మాయుపాధ్యాయులు వింధ్యపర్వతము మిక్కిలి యెత్తయిన దనియును, ఆనగరాజంబు వంగి నమస్కరింపఁగా నట్టెయుండుమని అగస్త్యమహాముని యానతిచ్చి, దానికి గర్వభంగము గావించె ననియును జెప్పిరే!

యోగి—కుమారా! అది యతిశయోక్తి.

చ. విను, మును నార్యులెవ్వరును వింధ్యము దాఁటుచు దక్షిణాపథం
బును జొరలే దగస్త్యముని ముం దరిగె న్గిరి దాఁటి, దాన నా
తనికి నమస్కరింప గిరి తద్దయు వంగఁగ వాని దాని న
ట్లునిచె నటంచుఁ దా మతిశయోక్తిగఁ బల్కుదు రింతియేసుమీ.

అజిత—ఓహో! ఇదియా కారణము.

రాజ—కుమారా! నగశృంగంబునుండి దిగుచు నెమర్కొను గులకఱాలం దొలఁగఁ దోయుచు, జలజలఁ బాఱుచు, నురుగులు గార్చుచుఁ జెలువగు నీ గూర్చునా సెలయేటికాలువను మేలుగుత్తుంబులం దిలకించితివా?

లయగ్రాహి.

పొంగఁ గన శైలముల శృంగముల డిగ్గి చను
చుం గెలఁకులం గలతరంగిణి తెఱంగున్
రంగుగఁ గనుంగొను కెఱంగటఁ జెలంగుశిల
లం గదిసి పొంగిపొరలంగ మది పొంగన్
ముంగల నెమర్కొనుబలంగముల మ్రింగుసర
ణిం గులకఱాలను వడిం గడచి గెంటున్
సంగరశతాంగపుఁ దురంగములభంగి నురుఁ
గుం గరము గ్రక్కుచుఁ దరంగముల బంటుల్. 111

యోగి—కుమారా! అజితసింహా! ఈ సెలయేటి కిరుగెలఁకులం గనుపండువు చేయు నీసృష్టివైచిత్ర్యశృంగారముం గనుంగొంటివా?

లయగ్రాహి.

సంగరశతాంగపు దురంగములభంగిని ద
రంగిణితరంగములు పొంగి పడిఁ బాఱున్

రంగగు తరంగిణుల చెంగటఁ జెలంగెడి ల
వంగముల లుంగముల భృంగములఁ జేరన్
భృంగములసంఘముల నింగిఁ గని పొంగుచు సు
ధంగొని యొసంగ సుమరంగములు చీరన్
రంగముల ముంగలికుడుంగముల నంగుగ వి
హంగములు పొంగుచుఁ దరంగములు పాడున్.

రాజ—యోగివర్యా! (కేలంజూపి) అదియే కాఁబోలును మొగలాయీచక్రవర్తుల కెల్ల నత్యంత ప్రేమాస్పదంబగు నాగ్రాపురాగ్రిగోపురంబు? పురంబుఁ దాపు వనే కలదు గాఁబోలు గోపురశిఖరంబు గోచరం బగుచున్నది.

యోగి—అవునదియే. ఓయీ! రాజసింహా! ఈపట్టణము సుమా రొకశతాబ్దముక్రిందట నొక చిన్న గ్రామముఁటు. ఆర్యభూమిని శిల్పవిద్యను పునరుద్ధారణము చేసిన షాజహానుచక్రవర్తికాలమునాఁటనుండియు నింతశోభ వచ్చుచున్నది.

ఆ. వె. మఱువలేక ప్రేమ 'మమజత్' సమాధిపై
'తాజిమహాలు' గట్టె షాజహాను;
నాఁటనుండి పట్టణం బయ్యె నియ్యది
తొల్లి యొక్క చిన్నపల్లెయె సుమీ. 113

రాజ—అయ్యా! ఆషాజహానుచక్రవర్తి యెట్టివాఁడు; పరిపాలనం బెట్లుండునది?

అజిత—మామయ్యా! ఎట్టివాఁ డని వేఱె యడిగెదలరేల? లంకను బుట్టినవారెల్ల రాక్షసులు గాక వేఱగుదురా?

యోగి—కుమారా! అట్లు తలంపకుము. తురుష్కులలో మాత్రము మంచిరాజులు లే రనుకొంటివా యేమి?

సీ. తనకీర్తి సకలదిక్తటము లంటఁగ జలా
లుద్దీను దేశ మేలుకొనలేదె
తుగ్లకుకులజుఁడౌ తురక ఫీరోజిషా
యింపుగాఁ బ్రజలఁ బాలింపలేదె
సమదృష్టి హిందూముసల్మానుల మహాక్బ
రమితదయఁ గాంచె యరయలేదె

అగ్రజన్ముల కనేకాగ్రహారము లిచ్చి
తానీష గోల్కొండఁ దనరలేదె
తురకలై పుట్టినంతనె దుష్టనృపులె
హిందువు లనంగఁ దాము సహీనకృపులె
హిందువులయందు దుష్టులౌ నృపులు లేరె
కులముతో నేమి ముఖ్యంబు గుణము గాక. 114

రాజ—యోగివర్యా! అయినచో నౌరంగజీబుచక్రవర్తిమాత్రము సుగుణసమన్వితుఁడు కాఁడా! వానిపాలన మిట్లుండ నేల?

చ. పరజనభీకరుండు, కడుప్రాజ్ఞుఁడు, శౌర్యుఁడు, పాలవాధుకం
ధరుఁడు, స్వకార్యనిర్వహణదక్షుఁడు, న్యాయవిమర్శనోత్సుకుం,
డురుతరదైవభక్తి మనుచుండు, సదా మితభోగి, ఈయలం
ఘురుపరిపాలనం బిటులఁ గాఁ గత మేమొ యెఱుంగఁ జెల్వుఁడీ.

యోగి—ఈతనియెడ నీవు చెప్పినసుగుణంబు లున్నవి. వాస్తవమే. కాని—

సీ. పరమతద్వేషాగ్ని పట్టి కాల్చుచునుండ
స్వమతరక్షణ మెట్లు చల్లఁబఱచు,
పరధనాసక్తి దుర్వారమై పీడింప
నిజధనం బెట్టులు నిల్వఁగలదు,
పరసౌఖ్యమునకు నోర్వక దుఃఖపడుచుండఁ
దనకు సౌఖ్యం బెట్లు దక్కఁగలదు,
పరరాజులకు గౌరవం బొనర్పఁ దలంపఁ
దనగౌరవం బెట్లు దనరఁగలదు,
సాధుహింస యనియెడు ప్రజ్వలదవాగ్ని
క్రమ్మి తను వంటి నిలువెల్లఁ గాల్చుచుండ
స్వల్పసుగుణంపుజందనచర్చ లేమి
పని యొనర్చును జెప్పుమా పార్థివేద్ర! 116

రాజ—అవును, నిశ్చయమే.

అజిత—స్వామీ! గమ్యస్థాన మింక నెంతదూరము?

యోగి—సమీపించితిమి. అదే మా చాయలం దోఁచు లూనీమహానది. ఆయేటిని దాఁటిన వెనువెంటనే యోధపురముం జేరఁగలము.

రాజ—యోగివర్యా! యోధపురసామ్రాజ్యమునకు శాశ్వతజీవనం బొసంగు పావన జీవనదం బగు లూనీమహానదియా యది?

ఉ. ఉన్నతమౌ ప్రదేశమున నుండుటచే నది పిల్లకాల్వయో
యన్నటుఁ దోఁచు, చుట్టుఁ గల యుట్టివనంబులు పైరుచేలు నా
కన్నులఁ దన్పు, నందు గల గ్రామసమూహము చేలమధ్యమం
దున్నకుటీరపఙ్క్తుల యోజను రాజిలు, దూరమౌటచేఁ. 117

యోగి—రాజసింహా! గమ్యస్థానముం జేరితిమి. ఇదియే విమల యొందు మన్యదుర్గము. దీనియెదుట నావలితీరమునం దనరారునదియే యోధపురీదుర్గము.

రాజ—స్వామీ! ఇదియా మన్యదుర్గము! ఏమి యపూర్వము!

ఆ. వె. ఎటుఁ గనంగ నిచట నేకశిలావృత
శైల మొండు దక్క సౌధ మేది
కానరాదు నాకు నిర్గమ కీకొండ
కోట చేర నేది బాట చెపుము? 118

యోగి—రాజసింహా! ఇదియే దీని ద్వారము. ఈనైసర్గికదుర్గము సామాన్యమానవలోకంబునకు దుర్గమము. దీనిం దెఱచు క్రియ నపరిచితుఁడవై చూచుచుండుము. (దుర్గద్వారము సమీపించి)

భుజంగ. మహాశక్తి దుర్గా! యుమా! పుణ్యమార్గా!
అహో శర్వరాణీ! మహాశూలపాణీ!
జొహో లోకమాతా! విశుద్ధాద్రిజాతా!
గృహద్వారము న్విప్పుమీ వేగ దేవీ! 119

రాజ—(ఆశ్చర్యమున) ఏమి యీ శిల్పకలానైపుణ్యము! దేవతానిర్మాణమువలె నున్నదే!

సీ. బహుపురాణాల శిల్పపుఁబని తాజ్మహాల్
కలియుగమయసభఁ గాంచినాఁడ

తొలి సుయోధను లక్కయిలు పోల్కి పిచ్చిటో
  గ్లాను కీర్తికే చెప్ప విని నాఁడ
పూర్వకాలపు శిల్పముల నేర్పెఱింగింప,
  ఎల్లోర గుహల సీక్షించినాఁడ
బలు మొత్త మగుసుత్తెగాలు పొత్తి కట్టిన
  మాతీమసీద్ గని మురిసినాఁడ
అవని నింకెన్నియో రమ్యహర్మ్యములను
గంటి వింటిని గాని యెక్కడను నిట్టి
వింతభవనంబు నేఁ గని విని యెఱుఁగను
పృథ్వి నిది యెన్నఁదగు వింత యేమొ? 120

యోగి—రాజసింహా! నీ వింక లోనికిం జని విమలం జూచిరమ్ము. నేమింతలో రాజనగరునకుం బోయి యచ్చటి కార్యములు చక్కఁజేసికొని వచ్చెదను.

(అజితసింహునితో యోగి నిష్క్రమించును.)

## 2. రంగము—మన్యదుర్గము.

[లోపల విమలయుఁ, బురుషవేషముతో వీరమాతయు ప్రవేశించియుందురు.]

వీరమాత—విమలా! నీ వెంతబేలవు! నీసహోదరుఁడగు కేసరితోఁ గోరి కోరి వైరముఁ బెంచుకొని, ఔరంగజేబుపాదుషా యంతవాని కాఁగిలికి దూరమైతివి!

శా. లేమా! యెంతటిబేల వీవు, విను ఢిల్లీపాదుషా యన్నచో
సామాన్యుం డనుకొంటివే మొ? గొనబౌ చక్కఁదనం బెంత! వి
ద్యామోదం బదియెంత! భాగ్యమును రాజ్యం బన్న నింకెంత! రా
జో మర్యాదల తీరదెంత! యిటుఁ గోల్పోఁ జెల్లునే వెఱ్ఱివై? 121

విమల—వీరాగ్రేసరా! ఆతం డెంతభాగ్యవంతుఁడైన నాకేమి?

చ. సిరినె వరించు లుబ్ధజనచిత్తము, శీలము నెన్న దఁదపున్
సిరినె వరించుఁ గామి చలచిత్తము, వేలు గణింప దెన్నఁడున్

సిరియును నంద మంతగ గణింపక నిత్యము శీల మెంచు సు
స్థిరగుణపూర్ణ నా విమలచిత్తము ప్రాజ్ఞులు మీ రెఱుంగరే! 122

రాజ—(ప్రవేశించి) ఇదే! ఈగదిలో నిద్దఱు ప్రసంగించుచున్నట్లున్నది. (పైనుండి చూచి) ఆమెయే విమల ఈపురుషు డెవ్వడో? * * కొంచెముసే పిచ్చట నే నాఁగి వీరిప్రసంగమువలన సంగతు లెఱింగెదఁగాక. (నిలిచి వినుచుండును)

వీర—విమలా! ఏలయీమాట? లభింపరానిభాగ్య మబ్బినవు డుపేక్షించుటకు నీవు మాత్రము చేలవా యేమి? హిందూస్థానమహాసామ్రాజ్యలక్ష్మీధురంధరుం డగు నౌరంగజేబుపాదుషావారు కోరి వరింతు మన వెనువీయు జవరా లీరాజస్థానమునందు కాదు భరతఖండమునం దెచ్చటనైన గలదే?

ఉ. తానఁట, పాదుషాహియఁట, తన్ను వరింపు మటంచు భూమి నే
మానిని నైనఁ గోరునఁట, మానిని వానిని మానునంట, తాఁ
బ్రాణము మేనఁ బూని మనునఁట, యి దెక్కడిమాట బోఁటిరో!
వానిని మానసేల? కలువంకలఁ జింతలఁ బొంద నేటికిన్. 123

కావున వానినే వరింపుము. లేకున్న చండశాసనుం డగు నాతం డేమి దిక్కులం బెట్టునో?

విమల—మహానుభావా! అలంఘీను తన్ను వరింపనిచో నాకేమో హానిచేయు నని బెదరించుచున్నారా? మీయట్టివారి రక్షణలో నున్న నా కట్టిభయంబును లేదు.

గీ. వైరిమదకుంభికుంభవిదారణప్ర
భావయుతరాజసింహంబు పాలి సొత్తు
క్రొవ్వి గోమాయువు హరింపఁ గోరుఁగాక
ప్రాప్త మగు నెట్లు వట్టిదురాశ గాని. 124

ఇదిగాక, అంత్యమైనయెడ మానరక్షణము చేసికోఁగల యాయుధంబులు మా కడనుం గలవు.

విమల—ఉ. మానము గాచు నాయుధము మాకడనుంగల
వీరమాత— దేదియేది?
విమల—ఒడ్డాణమునందు గుప్తముగ దాచినకత్తి
వీరమా— వృథా యదైన?

విమల—ఈ! వేణియె పాశమా;

వీరమా— అదియు వీగిన?

విమల— వజ్రపుటుంగరంబె నా

ప్రాణముఁ దీసి మానము నవశ్యము కాచును శంక లేటికిన్?

వీర—(తనలో) ఆహా! ఈవీరపత్ని రసపుత్రవంశహారమున మణిప్రాసవలె నున్నదే! కానీ ఇంకను పరిశోధించి చూచెదను. (పైకి) ఓ సుందరీ! అందఱు నిట్టి శిరంగనీతులు చెప్పువారే, ఆలోచించుకో. పాదుషా

రాజ—ఈపురుషుం డెవ్వరు! ఈవనితతో నింతచనువుగా మాటాడుచున్నాఁడు.

విమల—మహానుభావా! మానవతి యగుమానినికి మనోవాక్కాయకర్మంబులయందు మనస్సు ప్రధానంబు నామన సిదివఱకే యొకరి కధీన మయినది.

వీర—అవును. మనోధనంబు పాదుషావారి హృదయభాండారమునందే భద్రపఱచితివి కాఁబోలు!

విమల—క్రూరపాగ్రేసరా! ఈవిషమపరీక్ష యేల!

ఉ. ఓసఖ! నామనం బెటులఁగన్, పరిశోధమొ, హాస్య మాడుటో?
ఈసరి కే నెఱుంగ రెటులేని నిజ మ్మెఱిఁగింతు, నామనం
బీసరి కే భవాదృశు నరేశకుమారు వరించి, మించుచు
ల్లాసత నుండ మీ రిటు లలంఘి రలంఘి రనంగఁ బొంగునే! 127

రాజ—ఈమెయుద్దేశ మేమో!

వీర—ఓసి! వెఱ్ఱిపడుచా! ఏల యీలీల దొరకిన భాగ్యంబు సరకుసేయుదు! పోనిమ్ము ఇప్పుడైన మించినదేమియు లేదు. వలసిన నిన్నిప్పుడే ఢిల్లీశ్వరునియొద్దకుఁ బుత్తెంచెదను. ఆలోచించుకొనుము.

విమల—వీరాగ్రేసరా! వేయేల!

తే. గీ. కాదు, కా దన తెల్పు వివాద మేల?
విమల నిర్మలహృదయంబువిధము వినుఁడు;
నీతి లేనట్టివానిఁ దృణీకరించు,
ఈశుఁ డైనను వాఁడు ఢిల్లీశుఁ డైన. 127

వీరమాత్__

మ. ఎలనాగా! యిటువంటిబింకముల నే నెన్నేని విన్నాను; ఇం
తులవృత్తంబులు క్రొత్తలా మెనఁట; మీతోఁ బుట్టువేమున్న బెం
డిలికిన్ బూర్వము బింకముల్ పలుకదే నేఁ డేమి కావించె? మీ
కొలమందుం దలమానికంబవఁట; నాకుం జెప్పఁ బో కీనుడుల్.

విమల—పురుషవర్యా! నేనేమి చెప్పఁగలను? అనమానమనస్కులగు వారికి లోకమం
తయు దోషభూయిష్ఠమే?

వీర—విమలా! నొచ్చుకోకుము. నిజముగా నిన్నుఁ బరిశోధించుటకే యిట్టిమాట లంటిని.
మనస్సు నొప్పించితి నేని క్షమింపుము.

విమల—రాజచంద్రమా! ధర్మమా! ఇందు క్షమించుట కేమున్నది! ఇది లోకసహజ
మే! అభిమానవస్తువులనే వాడెకు ఛేయుదురు.

తే. జగతి నభిమానవస్తువులఁ గోనుసపుడు
కోరి శోధించువారె గైకొనెడివారు;
ఇంతకును శోధనము దుది హితవె కూర్చు;
క్రోధకారణ మెట్లగు శోధనంబు?

వీర—సుందరీ! పరిశోధనపర్యవసానము వేఱొకతీరున నున్నదటులు నీవు సామాన్య
కన్యవా?

చ. పొడమితి సాధ్వీరత్నములు పుట్టినయిల్లగు 'రాజపుత్రస
త్కుల' మను పాలవెల్లి, నతిభూగ్నసహోదరి ధిక్కరించి ని
ర్మలమతి రాట్కుమారునకు రాణివి గా వ్రత మూనినావు; నీ
లలన భవత్సమాన, విమలా! విమలవ్రతశీల! నిర్మలా! 130

రాజ—ఈపూరుషుని చర్యలు మిక్కిలి విపర్యాసములుగా నున్నవే!

విమల—సుందరజనకందర్పా! నే నిట్టి పొగడ్తలకుం దగినదానను గాకపోయినను మీ
యట్టివారిచే నిట్టిపున్నదెందనగాఁగునట్లు ప్రవర్తింప నిరంతరమూఁ బ్రయ
త్నించుదాన.

రాజ—ఇప్పు డేమి ప్రత్యుత్తర మిచ్చునో!

వీర—ఓతరుణీ! నాయట్టివారి కెట్లు తోఁచిన నీ కేమిలాభము?

విమల—మిత్రిసత్తమా! అదియేటిమాట. అప్రతిమానాభిమానంబున మానప్రాణరతుణ మొనర్చిన మాననీయుల మన్ననకన్న నాయట్టి కన్నె కోరునదేమున్నది?

వీర—విమలా! దానికేమిలే? నీ వలంఘీరుఁడంతవానిం ద్రృణీకరించితివిగదా! మఱెవ్వరి వరింప నిశ్చయించుకొంటివి?

రాజ—(అసూయతో) ఈప్రశ్న యేల?

విమల—నవయువతీరతీపతీ! ఈతీరునఁ బ్రశ్నించుట భావ్యమా? రమణీమణీమనోమందసంబులు రహస్యప్రసంగగుప్తంబులు కదా?

రాజ—అందుకే యీవచోబంధము. సరసములు మునుముందున్నవే!

విమల—మానినీమనశ్చోరా! ఇంక దాఁపనేల? నామనం బిదివఱకే రాజకుమారున కొకని కధీనం బయినది.

వీర—ఆతఁడు,

ఉ. రూపున నెట్టివాఁడు?

విమల— కలరూ పెటులఁగం చెద; భేద మేది? మీ

రూపమె మూఁడుమూర్తులన;

వీరమా— రూపవతీ! మఱి మేనిచాయరో?

విమల— ప్రాపగుచాయ మీదె;

వీరమా— సరె ప్రాయము!

విమల— ప్రాయము మీసమంబె;

వీర—ఎట్లూ? పరికింప చోద్య మిటులుండుట లాతని నామధేయమో?

విమల—బాపురె భర్తపేరడుగ భావ్యమె?

వీర— పెండిలి యైనవెన్క గా

దా పతి!

విమల— దాఁపనేర నిఁక నాతఁడె మీరును మీరె యాతఁడున్.

రాజ—సమీపవస్తుప్రియు లగు నెలఁతలను, లతలను, ఇఁక నెవరు నమ్మఁగలరు. రాజసింహా! తుదకీవిమల నేతిబీరకాయయే యయినదిసుమా!

విమల—మనోహరా! ఇఁక నన్నేల చిక్కులుపెట్టెదరు? ఇన్నిదినంబులనుండి, అగాధంబగు నీవియోగసాగరం బెదురీఁదుచుఁ దుదకెఁ జెన్నిధిగన్న పేదవిధంబున

మీసన్నిధిం గన్నదాన. మీపదంబులాన. ఇఁక నానరయేల? మీరు తప్ప, అన్యులం—(చేయి పట్టుకొనఁబోవును.)

వీర—(తప్పించుకొని) సుందరీ! ఆగుమాగుము. ఇంతయాత్రమేల? ఆత్రము సర్వజనగోత్రసౌఖ్యపతుకవిచ్ఛేదనవజ్రము గదా? (తనలో) ఈమె నాబహిర్వేషము గని మోసపోయినది. ఆహా! క్షేమజంబగు నోబహిర్వేషమా! నీ వెంత మోసకత్తెవు (పైకి) అలివేణీ! నిలుకడలేని ననబోటి వేషధారిపూరుషునిఁ గోరి నీవేమి సుఖింతువు?

విమల—విసువు జనించు, ఈప్రసంగమునకుఁ దుది లేదాయేమి? ఇంకను విషమపరీక్ష మానరుగదా? ఏమి చేయుదు!

వీర—సువిదా! ఏమిచేయనగు! నిన్నుంగన నాకునుం జాలి గలుగుచున్నది.

విమల—పోనిండదియు మేలే. జాలి ప్రసన్నతకు మొదటిమెట్టే గదా?

వీర—మదవతీ! అదియెట్లు? సాయము చేయలేకపోయినను, అమాయకుల దుస్థితిఁ జూచి మన మెల్లప్పుడు జాలిపడుచుందుము.

విమల—గుణజాల! వలచివేఁడెడు జవరాలి నీలీల పలుచనఁ జూచుట పాడియా?

వీర—అసాధ్యమగు కోరికఁ గోరితి వేమిచేయనగు?

రాజ—(తనలో) ఈతనిచర్య కడు విపరీతముగానున్నదే!

విమల—హా! యిదియేమి? ఈనూతన కుసుమశరసముండు నాఁ డాసరోవరతీరంబున బాసయిచ్చి, భైరవాలయంబున నాస హెచ్చించి నేఁడిట్టి యిచ్ఛలేని మచ్చున నుచ్చరించుచున్నవాఁడు!

రాజ—(తనలో) ఆహా! నే నెంత భ్రాంతిచెందితిని! పాప మీబాల యీమోసగానిం గని నేనని భ్రమించియుండనోపు. ఇది యేదో యింద్రజాలము! కాని! తుదముట్ట వినక తొందరపడరాదు.

విమల—సుందరీకందర్పా! మీచందం బేఁటియో మునుపటివలె లేదని సందియం బగుచున్నది.

వీర—సుందరీ! అందునకు సందేహమేఁ? ప్రస్తుతపు నా రూపు మునుపటివలె లేదు.

విమల—(తనలో) మనోహరుని యభిప్రాయ మేమియో?

గీతికం నవమదన! మదిని నినుఁ గోరి చేరితిని మదనా!

వీర— శశివదన! వదలు మిది తగదు తగదు శశివదనా!

విపుల—మదనుఁ డదయుఁ డయి పను నగుశరముల
నెద విదలిచె నవమదన! సదయ నినుఁ గోరి॥
వీర—మదను నదయుతను పదివిధములఁ గుందెద నెద కుదురుచు
కొనుము! వినుము శశివదన! వదలు మిది తగదు తగదు శశి॥

రాజ—(తనలో) ఇఁక నుపేక్షించిన మించినవచ్చును. సత్వరంబునఁ జని యీమోసగాని గుట్టు బయలుపెట్టవలయును. (చటాలునవచ్చి) ఓరీ దురాత్మా! ఆగు మాగుము.

పంచ. అరే! దురాత్మ! దుర్మదా! మదాకృతింధరించి, యీ
సరోజపత్రనేత్రమైత్రి సల్పి జల్పముల్ వచిం
చి, రంగుమీఱ నట్టిబెట్టు చేసి యింతలో తలో
దరిన్ వరింపఁ గోరి ఘోరదారుణంబుఁ జేసెదే? 132

వీర—ఓయీ! నీ వెవ్వరు? నిన్నిచ్చటి కెవ్వరు పిల్చిరి? ముందుగ నెఱింగింపక శుద్ధాంతఃపురంబులం జొర సాహసించితివి. రాజపుత్రుండవు కావా? నాగరికత యెఱుఁగవా?

రాజసిం—

చ. మనమున వాక్కునం గ్రియను మానక నన్ను వరించియున్న దీ
వసిత, అమాయికాత్మ, ఇటు వంచనచేయఁదలంచి నాదురూ
పునఁ గొని చానమానధనముం గొలఁబాడినదొంగ, వే దొరం
గనుక మదీయమా ధనముఁ గాచికొనం జనుదెంచినాఁడరా.

వీర—

ఉ. దొంగనొ లేక నే దొరనొ దొంగ యెవండొ! నిజమ్ము దేలు శే
మం గనుఁగొన్నచో; దురభిమాన మిదేల? వివాద మేల? నో
రుం గొని 'మిన్నగ లేసి మిడిగుడ్డ' నవచ్చిన మాత్రభీతియే?
సంగరమందుఁ జూపవగు శౌర్యము, కాంతలచెంతఁ గాదురా.

రాజ—ఓహో! బలశాలీ! నీ వబలవేనా!

గీ. మగఁటిమి గలట్టి మగవాని పగిది మగువ
సరస, సరససల్లాపముల్ సలుపు నిన్నుఁ

గాంచి పురుషుఁడ వని భ్రమియించినాఁడ;

ఇతివేషమైన నీజోలి యేల మాకు! 135

వీర—ఓ కాముకపరివరా! అంధకారంబునం జను పాంథుఁ డెట్లు వస్తువుల యథాస్థితి గురింపఁగలఁడు? నీవును కామాంధకారమునఁ జరించు పాంథుండవే గదా? మమ్ము నీయిచ్చవచ్చినట్లు దలంచుకొనవచ్చును.

రాజ—ఈపలుకుల కేమిలే. ఇంతకును మాకు నీతో నేమిపని! (విమలతో) ఓసుందరీ!

ఆ. వె. వీనిఁ గాంచి వలపుఁ బూనితివో లేక

నవ్వరింప నెంచినావో చెపుము!

ఉవిద! వానిఁ గోరియున్న నేఁ బోయెద

మనసు లేని మనువు మగువ కేల? 136

విమల—(తనలో) ఆహా! ఏమి యీభ్రాంతి! ఇప్పు డిద్దఱు రాజసింహు లగపడుచున్నారు!

వీర—విమలా! ఊరకుండు వేల?

ఆ. వె. సిగ్గు విడిచి వేగ చెప్పవే! బిత్తరీ!

వీరి చిత్తమందుఁ గోరినావొ;

ఆవినిష్ఠురంబె యధికతరం బంత్య

నిష్ఠురంబుకన్న నీరజాక్షి! 137

విమల—(తనలో) ఇత్తఱి నే నేమిప్రత్యుత్తరం బియ్యనేర్తును? వీసమైన వాసిలేక యిరువురియాకారములు సమానముగానున్నవి. (పైకి) ఓమానధనులారా!

ఆ. వె. మానధనులు సతుల మానంబుఁ గావ కం

కణముఁ గట్టుకొనిన ఘనులు మీరు

దీక్ష నిటుల నన్వరీక్షింప నెంతురే?

వెలుగె చేను మేయఁ దలఁచునట్లు. 138

వీర—చపలాక్షి! ఇది పరీక్ష కాదు.

విమల—అయినచో ముందు నా యీప్రశ్నకు సమాధానముఁ జెప్పుఁడు.

సీ. విపుల తేజస్స్ఫూర్తి వెలయురాణ్మణుల కే

పూతవంశాబుధి పుట్టినిల్లు

నిజమానరక్షణాసక్తి సతీలతల్
ప్రాఁకుట కెయ్యది పట్టుఁగొమ్మ
పిఱికికండయె లేని వీరాధివీరకో
టిభటాళి కేది పెట్టినదిపేరు
అతిభద్రముగ సత్కళాశ్రమధర్మముల్
వడి దాఁచుకో నేది వజ్రపేటి
ఎచటఁ బొడమిన నరులఁ గొమ్మనిచేవ
ఎచట రాట్కులము కళంక మెఱుఁగ దట్టి
యుదయపురరాజ్యలక్ష్మిపయోజపాణి
పాణిచేఁ బూనినట్టి భూజాని యెవరు? 139

మనోవాక్కాయకర్మంబుల వారినే కోరియున్నదాన.

వీర—సుందరీ! నీ వెంత మాయలమారివే!

చ. మొదట వరించియుంటి నొకపూరుషుఁ గోరి సరిత్తటంబునన్;
పిదపను దేవళంబునను వేఁడి వరించితి నొక్కతాపసిన్;
తుది ననుఁ గోరి వీనిఁ గని తొట్రిలుచుంటి వి దేమిచిత్రమే?
ఎచటఁ గలట్టివాఁడె వరుఁడే? యిది నీకులసాంప్రదాయమే? 140

విమల—పూరుషాగ్రేసరా! భైరవీదేవిసాక్షిగా నే మొదటినుండియు నొక్కపూరుషునే కోరియున్నదాన.

వీరమా—

చ. ముదితరో! చాలుచాలు! కడుమోదముకూర్చెడు, మాటతేటయి
య్యది విన నవ్విపోదు రెవరైనను; పల్కకు మిట్టిమాటలన్
జనువఁగ వేయి నున్నమతి సైతము పోయె నటన్నరీతిఁ బ
ల్కెద వెటు లెంచితే యొకని లీలను నల్వురి గుర్తిదానవే? 141

సేవ—(తొందఱగా ప్రవేశించి) స్వామీ! మీకోసర మెవ్వరో యోగి వచ్చి తొందఱ పెట్టుచున్నాఁడు.

రాజ—సత్వరముగ వారిని లోనికిఁ దీసికొనిరమ్ము.

వీర—చిత్తము. (లోనికిఁబోయి యోగితోఁ బ్రవేశించును)

యోగి—(హాహాకారమున) అక్కటా! ఈ యాలంఘీరు పాలనమున భరతవర్షమున కెంత గతిపట్టినది.

సీ. కొండలయండ నుద్దండులై చెండాడు
దండిమరాటీల దాడులుండ
గంధసింధురయూథగతి నరాతుల మ్రింగు
బందెలఖండుసిబ్బంది లుండ
పులిమీస లంది యుయ్యాల లూఁగు నాయ్కాలు
సాతనామీలు గోసాయి లుండ
ప్రాణాలపై నాస మాని హోరాహోరిఁ
బోరాడు రసపుత్రశూరు లుండ,
బందెలఁబున ఛత్రసాల్ప్రభుకి యుండ
రాజసింహుని కంఠానఁ బ్రాణ ముండ,
శ్రీశివాజికి బొందెలో జీవుఁ డుండ
భరతఖండమ! నీ కెంతపాటుగలిగె! 112

ఆహాహా! ఎంతటి ఘోరవిపర్యాసములు జరుగుచున్నవి!

సీ. విశ్వవిఖ్యాత కాశివిశ్వేశ్వరుని గుడి
కటకటా! తల్లిగాఁ గలసిపోయె;
జగతిలో నెంక గణింపఁగ రాని పుస్తక
భాండారములు కాలి భస్మమాయె;
వారణాశీపురవర్తిత బ్రహ్మవి
ద్యాశాల లవె గంగ దాఁటిపోయె;
హిందూజనంబుల కాందోళికల నెక్కు
భాగ్య మంతయును స్వప్నసుఖమాయె;

ఆర్యమతములపై ద్వేష మధిక మాయె;
బ్రహ్మకులమునఁ బుట్టుటే పాప మాయె;
గడుసుతురకకు నధికార గర్వమాయె;
పుణ్యమదిపోయె పాపమే పూర్ణమాయె. 143

వీర } అక్కటా! ఎంతటి దారుణవాక్యములు వినవచ్చుచున్నవి!
రాజ }

యోగి—(ప్రవేశించి) రాజసింహా! ఉపేక్షించిన మించివచ్చును.

గీ. మ్లేచ్ఛదౌర్జన్య మాపి పాలింప వేమి?
ప్రజలకష్టంబుఁ గని జాలిపడ వ దేమి?
వేదవిద్యను గాపాడ వెడల వేమి?
తొలుత చేఁ గాల నాకులతోఁ బనేమి? 144

రాజ—(నమ్రుఁడై) స్వామీ! క్షమింపవేఁడెద. నాయుపేక్షవలన నేమిద్రోహములు సంభవించెను?

యోగి—ద్రోహములా! తలంచుకొనిన గుండె చెక్కలగుచున్నది. ఆమ్లేచ్ఛులలోఁ గొందఱు తుచ్ఛులు—

సీ. సంధ్యవార్చెడు బ్రహ్మచారుల వ్రేల్మిగ
జంధెముల్ పెనబెట్టి లాగినారు;
గోమాంసఖండముల్ గొని యాహితాగ్నుల
కుత్తుకల్ చొర బల్మిఁ గ్రుక్కినారు;
తలపన్ను తెండని తపసులఁ బైకీడ్చి
మోటులాటీలతో మోదినారు;
పూపపాయఁపువన్నె పొలఁతుల బల్మిమైఁ
బట్టి పైకొని చెఱఁబట్టినారు;
మంచిలింగఁబులఁ బెకలించినారు;
చెలఁగి రక్తాభిషేకంబు చేసినారు;

మేటివిగ్రహములఁ మన్ను మెత్తినారు;
చేసినా రెన్నిపనులేని చెలఁగి వారు.

వీర—అక్కటా ! ఎట్టి కర్ణకఠోరములు !

రాజ—కటకటా ! ఈముక్కడిచక్రవర్తి పాపకాసారంబునకు పరీవాహంబు లేకయున్నదే !

గీ. ఎట్టి దుర్ముహూర్తపువేళఁ బుట్టినాఁడొ
పాపపుంజంబునకు మక్కపట్టు వీఁడు
ఎగ్గులే యగ్గుపాలుగా నదిగినాఁడు
మహిని "పాపీ చిరాయు" వన్మాట నిజము.

స్వామీ ! ఇఁక నాలస్యమేల ?

యోగి—నేఁడే రాజపుత్రసామంతులకెల్ల వర్తమానములంపి దర్బారుతీర్చి దీనింగూర్చి చర్చింపవలయును. రమ్ము. (అందఱు నిష్క్రమింతురు.)

బెజవాడ మైలవరం కంపెనీవారిచే ప్రదర్శింపఁబడు

— నాటకరత్నములు —

| | | | |
|---|---|---|---|
| ద్రౌపదీవస్త్రాపహరణము | వ. అ. | ... | 1-0-0 |
| పత్నీప్రతాప్ అనసూయ | సో. అ. | ... | 1-0-0 |
| సంపూర్ణభీష్మచరిత్ర | సో. రా. | ... | 1-0-0 |
| బొబ్బిలియుద్ధము | శ్రీ. కృ. | ... | 1-0-0 |
| పాదుకాపట్టాభిషేకము | పా. ల. | ... | 1-4-0 |
| రాధాకృష్ణ | డిటో. | ... | 0-12-0 |
| గయోపాఖ్యానము | చి. ల. | ... | 0-8-0 |
| శ్రీకృష్ణతులాభారం సాంగ్సు | చం. కే. | ... | 0-12-0 |
| రాధాకృష్ణ సాంగ్సు | డిటో. | ... | 0-12-0 |
| ద్రౌపదివస్త్రాపహరణము సాంగ్సు | పా. కాం. | | 0-12-0 |

వలయువారు:— సరస్వతీ బుక్ డిపో,
బెజవాడ.

కృష్ణాజిల్లా అని వ్రాసి తెప్పించుకొనవచ్చును.

శ్రీ

# రసపుత్రవిజయము.

## పంచమాంకము.

---

### 1 రంగము—ఔరంగజేబు దర్బారు.

[మయూరాసనమునందు నౌరంగజేబు విశ్రమించియుండ షయిస్థఖాను సదరుద్దీను మొదలగు నమాత్యులును, దిలేర్ఖాను, జయసింగు మొదలగు సర్దారులును, వజీరులును పరివేష్టించియుందురు.]

అవురం—సర్దార్! దిలేర్ఖాన్! ఆ స్వామిద్రోహి సౌరాష్ట్రదేశమునుండి యెచ్చటికిఁ బాఱిపోయెను? అక్బరు పేరు పెట్టుటచేఁ గాఁబోలును వీనికిని రాజపుత్రదాస్యము తప్పినది కాదు.

దిలేర్ఖాన్—అక్బరుకుమారుండు సౌరాష్ట్రమునుండి పారసీకమునకుఁ బోయెనను వదంతి.

అవురం—సరియే. పారసీకచక్రవర్తిపేర నీతనిని వెనువెంటనే మనయొద్దకుఁ బంపునట్లుగా నుత్తరమును వ్రాయవలయును. మామాజీ! షయిస్థఖాన్! ఆమరాటీ వనాటుని సంగతియేమి?

షయిస్థ—మామాజీసర్కార్! శివాజీ బీజపూర్ గోల్కొండదేశంమే చౌత్ అవుర్ జఫరదస్తుశే వసూల్ చేస్తూవున్నాడ్ విన్నామ్

అవురం—ఏమేమీ! ఆకొండయెలుక కంత కండ కావరమా!

సీ. బహుసైన్యరక్షిత పట్టణంబులు గాని
కొల్లఁగొట్టఁగఁ బల్లెటూళ్లు గావు
యవనచమూసమూహ మజేయ మిది గాని
చని దోఁచుకొన పాంథజనము కాదు
నేఁడు మొగల్ వాహినీప్రవాహము గాని
కడఁగి దాఁటఁగ కొండకాల్వ గాదు
రవ లంపి చంపు ఫిరంగిగుండ్లివి గాని
సెలయేళ్లలో నేఁటిశిలలు గావు

దొంగముూకల నణఁగార్ప దొరయుఁ గాఁడు
కొండకోటలఁ గెల్చుటే గొప్ప కాదు
కొండతో గొఱ్ఱె పోరాడఁ గోరుపోల్కి
కోరి మముఁ దాఁక నెంచెనే కొండయెలుక. 147

కానిమ్ము. వాని యాగడం బింక నెంతకాలము సాగఁగలదు. దక్షిణదిగ్విజయ యాత్ర సమీపించుచున్నది గదా. ఓ సుధీనిసులారా! మనరాజ్యపరిపాలనవిషయమున కొన్ని నవీనచట్టముల నెలకొల్పఁ దలంపుఁ గొంటిమి. వినుండు.

సీ. కాఫిర్ల కింక నధికార మీయఁగఁగూడ
దున్నయుద్యోగంబు లూడ్పవలయు!
హిందూజనులు చేయు హీనదేవతలజా
తర లింక మనసీమ జరుపరాదు
కుత్సింభరులు బ్రాహ్మణులు లింక దుర్మత
బోధంబులను జేయఁ బూనరాదు
దయయన్నమాట సుంతయు లేక 'జిజియ' క
చ్చితముగ నిఁక వసూల్ చేయవలయు
కత్తినొకచేత మఱి ఖొరాన్ పాత్ర మొకటఁ
బూని దెసల న్మసల్మానుబోధకు లిఁక
మొనసి యాసేతుశీతాద్రి భూములందు
స్థిరత నిస్లాము మతము బోధింపవలయు. 148

ఈనూతననిబంధనలు నిరాటంకముగా నమలు జరుగునట్లు మనపాలనలోని వంగ, కళింగ, కోసల, పాంచాల, శూరసేన సౌరాష్ట్ర, రాష్ట్ర ప్రతినిధులకు వెంటనే ఫర్మానాల లిఖించి పంపవలయును. ఓయీ! దిలేర్ఖాన్! మఱచితి. రాజపుత్రస్థాన ముునకుఁ బోయిన యజీము విజయవార్త యింకను రాలేదు. కారణం బేమియో, వారయువేగులగు వేగులవారలం బంపి కనుంగొనుము.

సేవ—(ప్రవేశించి)సర్కార్! దర్వాజాపై నాయభార్ వొఖర్ వచ్చి దర్శనంకే నూస్తున్నార్. వేషం వైగంబర్ వేషం వుండి.

అవురం—సరే; వాఁ డెవ్వఁడో ఆజీముకడ్డనుండి వచ్చిన చారుఁడు కాఁబోలును. పోయి వానిం దోడ్కొనిరమ్ము.

[అంత శాకర్ దుర్గాదాసు యోగివేషముతోఁ బ్రవేశించును]

యోగి—ఢిల్లీపురాధీశ్వరా! జోహర్.

అవురం—ఓయీ! నీ వెవ్వరు?

యోగి—ఢిల్లీశ్వరా! నేనొక రాయబారిని.

అవురం—రాయబారి వని నీచేతిలోని యుత్తరము చెప్పుచున్నది. నీ వెందుండి వచ్చుచున్నావు?

యోగి—ఉదయపురమునుండి.

అవురం—అచ్చట రాజసింహుని పొగరడఁగినదా?

యోగి—రాజసింహునిపొగరా! ఈయుత్తరముం దిలకించిన దెలియఁగలదు. (ఇచ్చును) మున్ముందు యవనవాహినీపరాభవమును, కుమారుం డగు నజీము పరాజయమును వినుండు.

అవురం—వైరిజనుల కజేయుండగు నజీమునకు పరాజయమా?

యోగి—పరాజయ మొక్క యజీమునకే గాదు రాజపుత్రస్థానమందు రాజసింహాకరవిముక్తనిశాతశరదవానలంబు యవనవనద్రుమంబుల దహించి భస్మీభూతంబు చేయుచున్నది.

అవురం—ఓరీ! వైరిజనవర్ణనాపరాయణా! భయములేక మాసముఖముననె వైరిపరాక్రమమును భూషించుచు మమ్ము దూషింప సాహసించుచున్నావు. జీవితాశ లేదా?

యోగి—ఢిల్లీశ్వరా! నేను రాయబారిని. రణరంగమునఁదలి వార్త లడుగుటచేఁ గల తెరం గెఱింగించుచుంటిని.

చ. అట విపరీతమై జవనమందె నకాలపుగ్రీష్మతాప కౌ
క్కటి రసపుత్రయోధ శర ఖడ్గ పరస్పర ఘర్షణంబునం
పటుతరమై తదగ్ని తమవాహినులం గల జీవనంబు లొ
క్కటొకటిగా హరించెడు నఖండమహామతి దేహళీపతీ!

అవు—ఏమిరా! నీయసంబద్ధప్రలాపములు! ఫలితోఁక గొడ్డికటచె నను పలుకులు పలుకుచున్నావు

శా. కొండల్ పింకి యొసర్పఁజాలెడిశతఘ్నుల్ భగ్నమైపోయెనే!
గుండెల్ చెంపుచుఁ గండలూడ్చెడితుపాకుల్ భస్మమైపోయెనే!
తుండానం బిడియేగ్గు డీకొను పిబంకుల్ పందలైపోయెనే!
కొండాడం దొరకొంటివా రిపులు నీకున్ లంచ మే మిచ్చిరో!

యోగి—తమకు బుడతకీచు లిచ్చిన ఫిరంగులును తుపాకులును రసపుత్రుల మంత్రప్రభావముచే కొంచెమైన పనిచేయలేదఁట. హిందువులలోఁ గొందఱు మహామంత్రవేత్తలును దైవబలసంపన్నులు నందుఁగలరు. ఇది యుద్ధభూమివార్తలు. ఇఁక నాసందేశము—

అవురం—ఓకోరి దుర్మదాంధా! ఏమిచెప్పవచ్చితివి!

మ. సమరోర్వీతలమం దజేయ మగు దోశ్శౌర్యోగ్రదావాగ్ని త్సు
ద్రిమతారణ్యములం దహింపఁ గల యౌరంగ్జేబ్ బడేషా నుషా
మము మీ రెవ్వనిఁగాఁ దలంచితిరి! బద్మాష్ వాల! సైతానుమం
త్రములా గెల్చు జగన్నియంత యగునాలంఘీరు నాలంబులో?

హిందవుల వందించెడు నీని నిప్పుడే మర్దింపుఁడు.

యోగి—మర్దింతురుగాని యింతలోఁ దొందఱెందుకు. ఇందఱనడుమం జిక్కిన నే నెందుఁబోఁగలను. నాసందేశము విన్న వెనుక మీచిత్తము వచ్చినట్లు చేయవచ్చును. సర్వమునకుం దెగించియే నే నిచ్చటకు వచ్చితిని. రాయబారుల వ్యాపారములు రసానుకారిణులు. సందేశమునందలి సందర్భాసందర్భములకు వారెంతమాత్రము నుత్తరవాదులు కానేరరు. తమ్ము బంచినవారి రాయబారమునందొక యక్షరమైనఁ దప్పిపుచ్చక చెప్పి వచ్చుట దూతలధర్మము. వినుట ప్రభుధర్మము. కావున నాసందేశము చిత్తగింపుఁడు.

సీ. మీవంశనిర్మాత మేదినీపతి బేబ
రేలఁడే ప్రజలు జేజే లొనర్ప
మీతాతతాత విఖ్యాతుఁ డాహుమాయూను
నేల యేలఁడె ధర్మనియతితోడ
హిందూముసల్మాను లేకమై ముద మొంద
నక్బరు మీతాత యశముఁ గనఁడె

మీతండ్రి షాజహాన్ మేదినీపతి త్యాగ
భోగంబులం దులతూగి మనఁడె
విమల తైమూరులంగు వంశమునఁ బుట్టి
ప్రతిభ హిందూమహారమాపాణిఁ బట్టి
నెమ్మిఁబుడిగద్దెపైఁ గాలుఁదమ్మి బెట్టి
నట్టి నీయట్టిజెట్టి కీచెట్ట తగునె? 152

అవురం—ఆ! అటు దారికిరమ్ము! తరువాత?

యోగి—

శా. హిందూస్థానమునందు బందెలమునం జెన్నౌ మహారాష్ట్రమం
దెందఱ్ సౌఖ్యమటన్న సున్నగద నీయాపాలనన్ బంధు; ఆ
నందంబొందఁగ హిందువుల్ దురక సన్మానింపుమీ! యింతకున్
హిందూబృందము జేసినట్టిదోసఁ గేమీ? నారి బాధింపఁగన్.

అవురం—అంరే! పాత్నామీ సైతాన్ వాలా! మఱల శారుకూఁత లారంభించితివా! ఇది ఘామపాదర్బారు! జాతిబొమ్మగుడి కాదు.

యోగి—ఇది నారాయణబోరము. అపరిస్తుతముగా సత్యనారాయణులను హిందూదేవతల నెందుకు నిందించెదవు! సాధుబాధయు దైవదూషణము వంశనాశనమునకుఁ గారణభూతములగును.

అవురం—అహాహా! (వెకసక్కెముగా) ఎంతబుద్ధిమంతుఁడవు! మీతాతను అప్పలును మావంశము నాశముచేయునా! దివానా! హైవాన్! నీవు సాధువా!

మ. క్షితిశెల్లం గతియంట దైవమఁట కాశీలింగనిం గాలఁ ద్రొ
క్కితి నేను య్యోను దన్మహాత్తు మధురాకృష్ణాలయం బగ్ని కా
హుతిఁ గావించితి నాఁ డెటుంజనియె మీయోగప్రయోగంబు నే
ర్చితిచే నేటికి కాఫిరుల్ మొగలు నాజిం గెల్చుమంత్రోక్తులన్.

యోగి—

ఉ. అట్టుల స్వాభిమానమున నాన్యమతంబులతో విరోధమున్
బెట్టుకొనంగఁబోకు చెవిఁబెట్టకు మిచ్చకు లాడువల్కులన్

'చెట్టు చెడఁగనున్నతఱిఁ జెట్టునఁ బుట్టెడుఁ గుక్కమూతిపిం'
దెట్టుల నీఁ డటంచు జను లందఱుఁ దిట్టక మున్న మేలుకో.

సీ. మొఱ బెట్టఁ జనిన విప్రులఁ బట్టి పడఁగొట్టి
కరుణఁ ద్రొక్కించిన కలుషఫలము
లింగంబులన్ బెకల్చి మసీదులకును సో
పానముల్ గట్టిన పాపఫలము
చలమూని దేవతోత్సవముల మాన్పిన
దుర్మదజనితదుష్కర్మఫలము
తలపన్నుగట్టి బీదల బాధపెట్టి బం
ధులఁ ద్రోంచినట్టి యాదోషఫలము
విన్నకే పోదు సుమ్ము నిన్నన్నిగతులఁ
గుడిపి కుడిపింపకుండ నీ పుడమి లోక
కంటకుండౌను నభివృద్ధిఁ గాంచలేఁడు
సాహితోక్తుల విప్రుడైనను విను మహా. 156

అవురం—ఔరా! ఔరంగజేబుషా ముసాపర్ఖానులోనే కారుకూఁత లాడుచున్నావు. ఎంతసాహసము! ఇదే కాచికొమ్ము! (కత్తిదూసి నఱుకఁబోవును.)

యోగి—(చమత్కారముగా తప్పించుకొని) ఢిల్లీశ్వరా! తొందరేల? ఆగుము. నీది భుజబలము, మాది దైవబలము. ప్రతిఫలముకోరి చేయువ్యాపారము నీది. మేమో కర్మఫలసన్న్యాసులము.

అవురం—ఓసద్గాయకులారా! ఉమ్రావులారా!

శా. ఏమద్దేవత లడ్డువచ్చెదరో తా నేదేవుని న్వేఁడి నా
యీదోస్సారము నోర్వఁ జాలెడినో యేదీ చూచెదంగాదె యీ
లో దాఁటంగను నీక యీక్షణమె కాలుంజేయి బంధించి శా
టీదాడంబులు చంకఁబెట్టుమునె బేడీ ల్వేసి మర్దింపుఁడీ.

దిలేర్ఖాన్—(లేచి) అరే! నీవెవ్వఁడవురా!

యోగి—ఓయీ! నే నెవ్వఁడనైన నీకేమి? నీ పాదుషా శ్రేయమునుగోరి యుదయపురి మహారాణావారగు శ్రీరాజసింహుని పనుపున నీకు హితోపదేశము చేయ వచ్చితిని.

అవు—

పంచ. అరేదురాత్మ! రాజసింహుఁ డంత నెంతవాఁడురా?
తరం బెఱుంగక నీవు పల్లదంబు లాడ నెంతరా?
దురుక్తు లాడు నిన్నుఁ ద్రుంచి దోర్బలంబుచే కనుల్
శిరంబు నెక్కినట్టి రాజసింహు గర్వమూడ్చెదన్.

యోగి—ఓయీ! వృథాగా తొందరపడకుము.

అవురం—ఏమి! ఆరాజసింహుఁడు మామొగలాయీల ధాటి కోర్వఁజాలక తనపెద్ద లుదయపురంబునకుం బాఱిన మాట మఱచెఁ గాఁబోలు.

ఉత్సాహ. కండకండ దూయుమా మొగల్ ఫిరంగిగుండుచే
గుండె పిండియై చితూరుకోట దాఁటి పెద్దలా
కొండకోనఁ గోటఁ గట్టుకొన్నమాట యెఱుంగఁ డా
తం డెఱుంగఁ బంపెదన్ పితల్ వసించు చోటికిన్.

యోగి—మాటల కేమిలోటు.

అవు—

శా. ఓరోరీ! ఇది యేమి కావరము నీ వున్మత్తతం జెందినా
వా? గట్టుల్ వచియింపసాగితివి దుర్వ్యాపారివై దుర్మతీ!
శేరా ప్రేలెదరి! నీ వెఱుంగవుర ఢిల్లీపాదుషావారి ద
ర్బా రంచు న్మతి మాటలాడినది యౌరంగ్జేబ్ ధరాధీశుగాన్.

యోగి—చిన్నతనంబున నుండియు నీవు చేసిన దుర్ణయంబు లెన్నిక మీఱియుండ నిన్నెఱుంగకుండు టెట్లు?

మత్త. చిన్నితమ్ముమురాదు వంచనఁ జేసినట్టి ఫకీరుగన్
నన్నలం దెగటార్చి రాజ్యము నాక్రమించిన నీచుఁగన్

మిన్నకే యశవంతుసంతతి మిఱింగఁ జూచెదు ద్రోహిగా
న్నిన్నెఱుంగుదు రెల్లవారలు నీ వెఱుంగ వదేమొకో.

అపురం—సర్దారులారా! తరంబెఱుంగక నోటికివచ్చినట్లెల్లఁ బేలుచున్న వీనిని ఖండ ఖండములుగా చెండింపక యింక నూరకొందురేల?

యోగి—ఓయీ! పిఱికిపందలగు వీరా నన్ను మర్దించువారు పౌరుషము కలదేని ఫాదుషావారే నాసత్తువ చవిచూచెదరుగాక.

ఉత్సా. పిఱికిబంట్లు వీర నన్ను బిల్కుమార్చు పోటరుల్
పెఱపు టెఱుపుఁ జెఱువ వెఱువ వెట్టి గాఁడు దుర్గదా
సెఱుఁగవే తదీయసత్వ మీవు మున్రణస్థలిన్
పిఱికికండ లేని నాఁటి వీరుఁ డీతఁడే సుమీ.

(చమత్కారముగా కత్తిత్రిప్పి తప్పించుకొని పోఁగ దెర జాఱును.)

2 రంగము—చిత్తూరుగఢము.

[దుర్గాదాసాదులు శత్రువశమైన చిత్తూరుదుర్గము లగ్గలకెత్తుచుందురు. గాయపడిన రాజసింహుఁ డొకటిశిబిరములో మంజరి చికిత్సోపచారములు చేయుచుండఁ బండుకొనియుండును.]

రాజ—అబ్బా! మంజరీ! నన్నెందు కాపెడకమ్మా!

మ. గెలుపో మృత్యువో నిర్ణయించెడి రణక్రీడ న్మదీయాప్తమి
త్రులు గావించెద రందు నాకొఱకుఁ; గాళ్లుం జేతులున్ లేనియ
ట్టులు నన్నుం బడి యుండుమందు, రిట, పుట్టువ్వాదిరాపుట్టు వే
చెలి! యన్యుల్గడియించి యిచ్చుసిరి వాంఛింపంగ నేజోగినే.

మంజ—దేవా! ధర్మమా! రాణావారిశరీరస్థితి ప్రస్తుత మెంతమాత్రము రణవ్యాపారమునకుఁ దిగియుండమి నట్లు మనవిచేసికొనుచుంటిని.

రాజ—మంజరీ! నిరంతరాయముగా వినవచ్చు నాధ్వని యేమో యెఱుంగుదువా? (లేచి కూర్చుండి)

మ. శరవృష్టిం గురియింపఁ గ్రమ్మకొను రాజస్థానసద్వాహినీ
చరణోద్ఘాతపరాగ మేఘచయగర్జాప్రాయమై వైభూ

వరధైర్యోరువనీవిదాహదహనజ్వాలోగ్రరావంబు నై
పరతెంచు స్వనలేదె దానిరహతూర్ బల్వాహినీదుందుభిన్.

మంజ—దేవా! వినుచుంటి నది మనరహతూరుగణదుందుభియే.

రాజ—అగుఁగదా మఱి!

క. వినునది యారణదుందుభి
జనియించిన దా హమీరుసద్వంశం బో
వనితామణి! మెగు లాగెదఁ
బనివిని కొనిరమ్ము నాహవాలున్ హాఁకన్.

(నిలఁబడఁబోయి చతికిలఁబడును)

మంజ—(పడకుండ హాఁపి) దేవరవా రిప్పటికి శాంతింపవలయు. అదే దుర్గము సింహద్వారముదరి పరిఖాపరిసరమున సంకులసమరము జరుగుచున్నది.

రాజ—ఎక్కడ? ఎక్కడ? దుర్గాదా సందున్నాఁడా! ఆగవాక్షమార్గమునఁ జూడుము. భద్రము!ధూర్తులమాపులు! శతృలతూపులు! కనుఁగలిగి మెలంగుము.

మంజరి—(చూచి) అహో! ఇప్పుడు పోరు కడు ఘోరముగా నున్నది. పాశ్చాత్యభగద్వయంబో యనున ట్లుభయసైన్యంబు లొండొంటిం దాఁకి శరవృష్టిం గురియుచుఁ గనులు మిఱుమిట్లు గొలుపుచున్నవి. ఇరుబలంబు లిప్పుడు సమానముగాఁ బోరుచుండుటచే జయాపజయములు నిర్ణయింప వీలు చిక్కకున్నది.

రాజ—అందు దుర్గాదా సగుపడుచున్నాఁడా?

మంజరి—(చూచి) లేదు. అతనిజాడ కానరాలేదు.

రాజ—అదియేమి పాపము! గాలి తీవ్రముగా నున్నపుడే నావికుఁడు చుక్కాణి వీడియున్నాఁడా?

మంజరి—ఆ! ఇప్పుడగుపడుచున్నాఁడు. పొగమంచువలెఁ గప్పిన శతృశరజాల మిప్పుడావీరుని హేతిచ్ఛటాకీలలచేఁ గొంచెము వీడఁబాఱినది. అందుచే నే నిప్పుడాతనిం జూడఁగలిగితి. అదే! అదే! మనదుర్గాదాసు నెవ్వరో- ఎవరో కాదు- మ్లేచ్ఛసేనానాయకుఁడే-దిలేర్ఖానుఁడే- తలపడినాడు. ఆహా! ఏమి యాయిరువురువీరుల శస్త్రకళానైపుణ్యము. కత్తులు తుత్తునియలగుచున్నవి. కాని వారికాయములు లేశమైన గాయపడవు. అహహా! విస్ఫులింగములు! ఉభయుల ఖడ్గముల పరస్పరదుర్ఘర్ష సంఘర్షణబలమువలన జనించిన విస్ఫులింగ

ములు జ్యోతిర్లింగణసంఘంబుభంగి దురంగలించుచు సంగరరంగంబునకు వింత సింగారముం గలిగించుచున్నవి. అయ్యో! పడె! పడియె! పడిపోయె నింక గత్యంతరమేమి? భగవతీ! భైరవీమాతా! దుర్గా! సమస్తాపమార్గతమఃప్రభర్గా! కాత్యాయనీ! అకాలమృత్యుసంహారిణీ!

రాజ—అయ్యో! యోధపురవీరాగ్రేసరుం డగు దుర్గాదాసే పడిపోయెనా? ఇంక నేమిగతి! స్వామియేకలింగజీపై భారము వైచి నేనిదే రణరంగమునం దుఱుకు చున్నాఁడ.

మంజ—దేవా! ఆఁగు డాఁగుఁడు. భగవదనుగ్రహంబున మనదుర్గాదాసు చెక్కుచెదరకుండ లేచి యరాతుల హతమార్చుచున్నాఁడు. హాయి! హాయి! ఇప్పుడు చూడవలెను. సముత్తుంగభంగీతరంగముల తెరంగున నిరుబలములలోని మత్తమాతంగతురంగశతాంగములొక్కుమ్మడి సంగరరంగమునలంకరించినవి. ఆహా! అదిగదిగో! కులశైలములవలె లేచిన రెండుమహాతరంగముల రాపిడి. ఈయొర యిక నిటో యటో తేల్చుచున్నట్లున్నది! జే! జే! ఏకలింగజీ! శిశోదియా పౌరుషోదయప్రియ భైరవమూర్తి! మేవారుమహాసంగ్రామశక్తీ! ఎట్టకేలకు మనవారు సింహద్వారమును భేదించుకొని లోనికిఁ బోవుచున్నారు.

(కోటలో కలకలము)

రాజ—మంజరీ! ఆగు మేదియో హెచ్చరిక వినవచ్చుచున్నది.

(కోటలో కలకలానంతరమున దిలేర్ఖాను)

శా. ఢీకొల్పంబడె, గొమ్ములేనుఁగు లగాడీదేవిడీఁ దాఁకఁగన్
ప్రాకారంబులపై ఫిరంగు లొక తేపం బారు కావింపుఁడీ
ప్రాకట సాగిరి గోడలం దుడుకుతైలం బొంటిపైఁ బోయుఁడీ
రాకుండన్ రిపుసేన నడ్డుఁడదె దుర్గాదాసు మ్రందింపుఁడీ.

రాజ—మంజరీ! వినుమంటివా! వారిరాక్షసోచిత—(చెవియొగ్గి) సద్దు! సద్దు! మఱి యేద్దియో వినవచ్చుచున్నది.

(సింహద్వారమునొద్ద దుర్గాదాసు)

మ. కినుకన్ మ్లేచ్ఛులు తుచ్ఛబుద్ధి నదె! యగ్ని క్ష్వేడనాళీకసా
ధనసంపత్తిని జూపఁగాఁ దొడఁగి రుద్యచ్ఛౌర్యులై మీర తే

యనుయానంబులు లేకముందుజనుఁడాయాయంత్రముల్ స్వీయమం
త్రనిరూఢి న్విఫలంబుఁ జేసె నిదె దుర్గాదాసు సామాన్యుఁడే.

మంజరి— మేలు మేలు వీరాగ్రేసరా! నీహెచ్చరిక కెంతయు మెచ్చదగ్గును.

రాజ— మంజరీ! ఉభయబలంబుల కోలాహలము మిన్నుముట్టుచున్నది. మనవారేదో అట్టహాసము చేసినట్లున్నారు. ఆకట్టునఁ జూచి స్పష్టమగు సమాచార మెఱిఁగింపుము.

మంజరి— (చూచి) ప్రవేశించుచున్నారు. సింహద్వారమును గొమ్ముటేనుఁగులచేఁ ద్రొక్కఁగావించి మనదళమ్ములొక్కుమ్మడి లోనికిఁ ద్రోసికొనిపోవుచున్నవి. ఆహా! గండిపడిన చెఱువునుండి జలప్రవాహమువలె నాఁప శక్యముగాక మొగల్ వాహిని లోహారిసాహారిని మనవారిపై మోహరించినట్లున్నవి. మనవారావాహినీప్రవాహమున కెదురీఁదుచు ముఖాముఖిని బాహాబాహిని హోరాహోరిని ఘోరముగా పోరుచు లోనికిఁ బోవుచున్నారు! ఆహా! అదేమది! శత్రువాహినియందలి మహోత్తరమైన తరంగము పొంగి పొంగి పొరలి తెగి నురుగులు గ్రక్కుచు నొక్కరడిగా మ్రింగునట్లు మనవారి నెదుర్కొన్నది. ఇది యేమగునోగదా దైవమా! మేలు మేలు రసపుత్రవీరులారా! ఎంతలాఘవముగా దాని నతిక్రమించిపోయిరి. ఇప్పుడు చూపిన మీయుద్ధకళాకౌశల్యము మిగుల వర్ణనీయము. అదియేమి? మఱొక్క తరంగము మఱియొకటి మఱొకటి యవనచమూసమూహము సముద్రతరంగములవలె క్షణక్షణోజ్జీవిత మగుచున్నది. అదియేమి నఱికినశిరస్సులే మఱల మొలకలెత్తుచున్నవా యేమి? అయ్యో! ఇఁక నెక్కడికోటు! పెనువాన కోయగాలి దాపరించినట్లు తురకలనిప్పుడి కాఫ్ఘనులదండు బాసటయై తండోపతండముగా మనవారిం దలఁపడుచున్నది.

(లోపల దుర్గములో తురకల కలకలానంతరము)

మ. పోదుఁడీ! పేల్చుఁడి కాల్చుఁడి మ్రోడచు నిప్పుల్ కుప్పగా గుప్పుఁడీ!
యుడుకుం దైలముఁ జిమ్ముఁ డెక్కుటకు నుద్యోగించు నవ్వారిపైఁ;
నడుఁడీ ముందుకు షాదుషా యదిగో! రాణాచేతిలోఁ గ్రమ్మఱం
బడె చిత్తూరుగడెం బన న్వెడుచునే ప్రాణాలతో మిమ్ములన్.

మంజరి— మహారాణావారికే జయము నిశ్చయము. వింటిరా! ఉపశ్రుతియు నట్లే యుద్ఘోషించుచున్నది.

రాజ—ఎట్లు మంజరీ!

మంజరి—ప్రభువువారు వినియున్నారుగదా! తురకల హెచ్చరికయందలి తుదివాక్యము "ఫామషా యిదిగో రాణాచేతిలోఁ గ్రిమ్మరింబడె"నని వినవచ్చుచున్నది.

రాజ—కథాస్తు! నిశ్చయమే! మంజరీ! మరల నేదో హెచ్చరికవలె వినవచ్చుచున్నది గమనింపుము,

(తెరలో దుర్గాదాసు హెచ్చరిక)

ఉ. తోఁసి చనం డిదే యదను తుచ్ఛయుతిం గొని మ్లేచ్ఛు లెద్దియో
మోసము చేయకుండ మునుముందె చొఱంబడుఁ డీగడెంబు; వి
శ్వాసము రాజపుత్రులకు సాజము, చావు తృణంబు నార్యభూ
మీసతి వీరమాత యను మేలిమిఁబల్కుల నిల్పుఁ డిప్పుడే.

మంజరి—జయ జయ కాళీ! మరల శస్త్రయుద్ధమునకుం దలపడినారు.

రాజ—ఎవరెవరు?

మంజరి—జయసింహ దుర్గాదాసులు. అశ్వారూఢులై హోరాహోరిని పోరాడుచున్నారు.

రాజ—జయసింహుఁడా? శివాజీని బట్టి యిచ్చిన మిత్రద్రోహి యితఁడే గాదూ?

మంజరి—చిత్తము అతఁడే. ఈయిరువురిరాహుత్తుల కత్తిపోరు చూడ చిత్రముగానున్నది. చూపఱ కోలాహలధ్వనులును కత్తుల తళతళ కాంతులును నింద్రియవ్యాపారనిరోధము గావించుటచే స్పష్టముగాఁ దెలియరాకున్నది. అయ్యో. తెగిపోయినది యోధపురవీరకంఠీరవునకు కంఠమంతయ నైపోయినది.

రాజ—ఎవరికి? మనదుర్గాదాసునకేనా? భరతమాతసాక్షిగా నే నిఁక వాఁగఁజాల.

మంజరి—బాపురే! శాబర్జీ! దుర్గాదాసా! తుత్తుకను త్తరింపనున్న కత్తివేటు నెంతవిచిత్రముగాఁ దప్పించుకొంటివి. అదే వేయుమన్నాఁడు. వేసినాఁడు. జయసింహునిపని యీదెబ్బతో సరి.

రాజ—ఏమైనది? జయసింహుఁడు పడిపోయెనా?

మంజరి—ఇంకను లేదు. వానిగుఱ్ఱ మత్యంతలాఘవముతో గంతి స్వామిప్రాణములకై స్వప్రాణము ధారవోసినది. అదే యిరువురును గ్రిందికి దిగి మగుడఁ దలపడిరి. అయ్యో! పడియె! పడియె! అభిమన్యుకల్పుఁడగు దుర్గాదాసే యుద్ధభూమికి బలియయ్యెను. ఇఁక నేమిదిక్కు!

రాజ—మంజరీ! ఇఁక తాళఁజాల. ఏదీ! నాయశ్వము నాయత్తముచేసి సత్వరముగఁ గొనితెమ్ము. లేదా రథమునైనం గొనితెమ్మని సారథికిం జెప్పుము.

మ. ఇదిగో పోయెద నస్మదీయశరవహ్నిన్ మ్లేచ్ఛసైన్యంబుఁ గా
ల్చెద భస్మమ్మొనరించి వచ్చెదను ఢిల్లీనేతకుం బుద్ధి చె
ప్పెద మేవారు శిశోదియాన్వయులసద్వీర్యప్రసాదంబునం
దుదునేదారుల్ చవిచూతు రీక్షణమె చిత్తూర్ కోట సాధించెదన్.

(లేవఁబోవును)

మంజరి—ఆర్యపుత్రా! ఎంతవీరాగ్రేసరులైనను దమకాయమునందలి గాయములు మాన్పుకొనిగదా యరాతులకాయములు గాయపఱుపం బ్రయత్నింతురట. తాఁ బోయిన వెనుక మిగులునదేమున్నది?

రాజ—మంజరీ! ఓ వెఱ్ఱిదానా! ఏమంటివి! మిగులునదేమున్నదనియా?

మ. పగఱం గెల్చిన రాజ్యము న్సిరియు సంపాద్యంబు తాఁ గూలినన్
మిగులం గీర్తి యిహంబునన్; పరమున న్మేలైనస్వర్లోకసౌ
ఖ్యగతుల్ గల్గు, రణంబె జీవనము రాజై పుట్టునవ్వానికిన్
మగువా! పల్కఁగఁ జెల్లునే యిటు లపస్మారప్రమాదోక్తులన్.

(లేచి నిలువఁజాలక కూలఁబడును)

అయ్యో! ఎంతశక్తిలేనివాఁడనైపోతిని! మంజరీ! దుర్గాదాసుసంగతి యేమయ్యె? మఱియొకపరి పరికించి చెప్పుము. అంతకంతకు నా కాయాస మధికమగుచున్నది.

మంజరి—చిత్తము. (పోయి మరలి) రాణావారికి జయము జయము. దేవా! మనవారు దుర్గములోఁ బ్రవేశించినారు. దుర్గాదాసు సురక్షితముగా నున్నాడు.

రాజ—మంజరీ! శుభవర్తమానమునకిదే నీకు బహుమానము (ఆయాసముతో) ఇస్! అబ్బా! నాయారాట మిప్పటికిఁగదా శాంతించినది!

(విశ్రమించి నిద్రపోవును)

మంజరి—(తనలో) రాణావారు నిద్దురపోవుచున్నారు. రణవర్ణనము వినుచుం బూర్ణముగా వలసిపోయిన రాణావారి సర్వేంద్రియములకుఁ బ్రకృతిమాత స్వయంకృతోపచారములచే నెంతయు విశ్రాంతిఁ గలిగించినది. కాని నేనుమాత్ర మప్రమత్తురాలనై యుండవలయును.

(అని ఘటకుటీరమ్మునందలి దోమతెర వాల్చి కనిపెట్టి యుండును)

[అంత నజితసింహుఁడు ఖడ్గపాణియై సావళితోఁ బ్రవేశించును]

అజిత—శాంతము. సావళీ! నన్నిపు డాపకుము. పోయి రణరంగమునం దుఱికెదను

గీ. పురుషజన్మంబు నెత్తిన పురుషుఁగూడ
యుద్ధభూమిని వడివడి నుఱుకుచుండ,
రాజపుత్రుఁడనై పుట్టి రణమున భయ
పడుదునా గాజులం జేతఁ దొడిగినాన.

సావళీ! నన్నాపకుము సోదరుం జంపి జనకుని మరణమునకుఁ గారణమై జనయిత్రిం బెక్కుచిక్కులం బెట్టిన నీచునిఁ గడతేర్చవలయును. కావున నన్నాపకుము.

సావళీ—కుమారమహారాజా! ప్రభువారి కింకనైదేండ్లయిన లేవు. మామయ్యగా రాపని నీపాటికిఁ గొనర్చియే యుందు రాగుఁడు.

(తెరలో) రాణావారు యుద్ధభూమిలో లేరు. గాయపడి యెదుటి శిబిరములో మంజరిచే చికిత్స నొందుచున్నారు.

సావళీ—అయ్యా! ఎవరుమీరు? కోట ఏమయినది? (చెవియొగ్గి విని) అయిన సంతోషము! సంతోషము! మనకు స్వాధీనమైనదికదా! మీకు శుభము!

అజిత—సావళీ! ఏమీ! మామయ్య గాయపడినారా?

గీ. ఏమి! మామయ్యకుం గాయ మెట్లు కలిగె?
చెప్పుమా గాయపఱిచిన చెనఁటి యెవఁడొ?
వేగి శిక్షించి వచ్చెద నీక్షణంబె
మామగారికి మదిలో శ్రమంబు తీఱ.

సావళీ—మహారాజా! మీ రంతవారలే యగుదురు (ఎత్తిముద్దాడి) ప్రభూ! అప్పటికే పోవుదము. దయచేయుఁడు. (ముందుకువచ్చి తనలో) ఈమంజరిని చూచిన నాఁటనుండియు నాప్రాణనాయకి యిందిరయై యుండునేమోయని యనుమానము కలుగుచున్నది. నాఁడు నే పకీరువేషమున నున్నప్పుడే యడుగవలయునను కొంటినిగాని ముందటి కార్యమునకు భంగమని యప్పటి కూరకుంటిని. తరువాత సమయము చిక్కినదికాదు. నేఁడు తప్ప కడిగి చూడవలయును.

(అజితునితో నిష్క్రమించును)

[అంత విమలయు, వీరమాతయు, వీరపురుషోచిత వేషములఁ బ్రవేశింతురు]

విమల—వదినయ్యా! ఆ మాపట్టునవియే నా హారావళీపర్వతములు?

వీరమా—విమలా ! అప్పనివియే. ఈయరావళీపర్వతములిక మన రజపుత్రకుటుంబము లకుఁ గన్నతల్లివంటివి సుమా !

సీ. ఇదెగదా! మును ఖుమా నెన్నియోమారులు
యవనయోధుల గెల్చినట్టిచోటు
ఇదెగదా! కరుణము న్నెదిరి తన్నోడింప
వడి కుత్బుదీన్ భంగపడినచోటు
ఇదెగదా! తైమూరు నెదిరించి మొఘలుఁ
దనుపమకీర్తిఁ గైకొనినచోటు
ఇదెగదా! అక్బరు నేచి వీరాబాయి
తనభర్త విడిపించికొనినచోటు
ఇదియె రసపుత్రవీరుల కెందు నోటు
పాటనెడిమాట లోటని చాటుచోటు;
ఇదియె యొఱఁజూపి మ్లేచ్ఛుల నీడ్చుచోటు;
అరికిఁ జొఱరా టరావళీగిరివిరాట్టు.

మన మిట్టిస్థలానుకూల్యతచేతనే గదా కాకి మూక తురకపలుగాకులం బోఁ ద్రోవఁ గంటిమి.

విమల—నిజమే ! వదినమ్మా ! ఆవైపుం దిలకింపుఁడు !

ఉ. భీమలబాయినాఁ దురకసేనలు కోనల దాటి పైకిరా
నేమియు దారి లేక గుహలే శిబిరంబులుగాఁ గ్రహింపఁగా
భీమలసింగమో యనెడి చెల్వైన భిల్లుఁ డొకండొకండె తా
నే మడియింప సాగెడి ననేకుల మ్లేచ్ఛుల నొక్కవేటునన్. 175

వీరమా—విమలా! అగుంగాని యిప్పుడీపెండ్లివడకలకుఁ దరుణము కాదు. అడుగు వడిగా నిడి నడవఁగడంగుము. ఆవల విరోధివరూధిని మోహరించుకొని వచ్చుచున్నది. మందయానా ! యుద్ధానంతరమునఁ బెండ్లి కడుగులలో నడుగు లిడుకొని నడవ వచ్చును గాని యిప్పు డించుక శీఘ్రయానవు కావలయును.

విమల—వదినా ! ఏమిపరిహాసములు చేసెదరండీ !

వీరమా—విమలా! మరణముం గోరి మిడిసిపడు నాతురకపురుషులం దిలకింపుము.

గీ. చెదపురు గొంకింత తెక్కరాఁ జెదలఁ బ్రాఁకి
దీపికను గాంచి ఫల మని దిగి తెగుగతి
రాజపుత్రపతివ్రతాపాగ్ని మ్రగ్గుచున్న
యవనశలభంబులం గనుమా! లతాంగి!

విమల—వదినా! నా వేల్పుచాయం గనుంగొనుఁడు. మ్లేచ్ఛసైన్య మను కార్చిచ్చు ప్రజ్వలింపుచున్నట్లున్నది. దానిం జల్లార్పుటకు మనరసపుత్రవాహినులు మోహరించి యున్నవా?

వీరమా—అన్నియు సిద్ధముగా నున్నవి.

గీ. అలశిశోదియావంశమహార్ణవమున
నుద్భవించిన రాజసింహోరుజలద
మదిగో శరవృష్టిఁ గురియింప మొదలుపెట్టె
యవనవనవహ్ని చల్లారు టనఁగ నెంత.

(తెరలో) అయ్యో! ఏమిమీభ్రాంతి! రాణావారింకను రణరంగమున నుంటి రనుకొనుచున్నారు. గాయపడి యీసమీపశిబిరములో నున్నారు. ఆ ప్రవర్గములోని వారైనచో దర్శనము చేసికొనవచ్చును.

వీరమా—ఎవరుమీరు! అమంగళవాచకులు. నాయనుంగు సోదరుఁడు రాజసింహుఁడు మేవారుమహాసామ్రాజ్యలక్ష్మిమనోనాయకుండు గాయపడెనా? పొరపడక నిజము చెప్పుఁడు.

(తెరలో) అవును వారే! ఇప్పుడు ప్రమాద మేమియు లేదు. మంజరి సమయోచిత చికిత్సోపచారములచే నుపద్రవమంతయుం దప్పినది.

విమల—వదినా! మన మరిగి సత్వరముగ వారిం దర్శింపవలయును.

వీరమా—సరియే! రమ్ము.

(ఇరువురుపోయి ద్వారమున నిలచి మంజరీ యని పిలుతురు.)

మంజరి—(తలుపుదీసివచ్చి విమలం జూచి) ఓహో! విమలాదేవిగారా! శిబిరములో నున్న మగయోధులవారిం జూడ యుద్ధభూమినుండి వచ్చిన యోధమగవారి కనేకస్వాగతములు! రండు! లోనికి దయచేయుఁడు. (వీరమాతఁ జూచి నాలుక

గఱచుకొని తగ్గి) విమలా. వదినగారుకూడ వచ్చియున్నారా! నీవొక్కతెవే వచ్చితి వనుకొని మేళ మాడందొడంగితిని.

వీరమా—(ప్రవేశించి) గజ్జెగట్టి యిప్పటికి కాల్గు సాని వైతివిగదా! ఇంక మేళమాడుట కేమిలోటు? దానికేమిలే. మంజరీ! రాణావారు నిద్రపోవుచున్నారు కాంబోలు. ఇప్పుడు కొంచెము సుఖముగా నున్నదా! మారాక ప్రతిబంధకము కాదుగదా.

మంజరి—దేవీ. ఇప్పుడు సుఖముగానే యున్నది. ఇంతదనుక ముచ్చటించుచునే యున్నారు. ఇప్పుడే కొంచెము నిద్రపట్టినది.

వీరమా—సద్దుచేయకుండఁ బోయి యొక్కపరి చేయి మాడవచ్చునా!

మంజరి—శుభ్రముగ చూడవచ్చును గాని విమల వారికంట పడరాదు.

వీరమా—పడిననేమి? మేము మానిజరూపముల లేము గదా. (పోయి చేయిపట్టుకొని నాడిచూచి) ఇప్పు డేమియు దోషము లేదు. జ్వరతీవ్రత యుడిగినది.

విమ—వీరు లేచునంతలో మనము యుద్ధభూమికిం బోయివత్తుమా?

(ఇరువురు నిష్క్రమింతురు.)

(తెరలో)

ఉ. ఓరసపుత్రులార! స్వబలోర్జిత నిర్జిత శత్రులార! మీ
వీరము నేడు హెచ్చెఁ గడువీరుఁ డలంఘిరుఘాదుషాహి యే
కోరి ఘటింప సంధి యిదిగో! వెలిబొక్కముఁ బుచ్చె నింక మీ
మీ రణకృత్యముల్ నిలిపి మిత్రితతో మము నాదరింపుఁడీ!

మగ్గా—(అది వినిపించుకొనకయే పైకి వచ్చి)

సీ. శ్రీకుమారసమానుఁ జిన్నిపాపనిఁ జంప
విష మంపినట్టి యీ వెంగలీఁడు
కల్యాణి విమల సంకల్పంబు చెడఁగొట్ట
దొంగలం బంపిన దోసకాఁడు
భైరవీదేవ్యవతార మాజోద్బార
వీరమాత నశింపుఁ గోరువాఁడు

దర్బారులో మానధను రాజసింహుని
దూషింపుచుండు నాదుండగీఁడు
తోడినృపులకుఁ దల చూప నోడి పారు
మమును బోనాడి, యల పాదుషాహి నేఁడు
బేగడ విధాన నేమూల డాఁగినాఁడొ
లీల తెలుపుఁడి మగను రాలేదు మేము. 179

దిలేర్ఖాను—(తెలిజండాతో పైకివచ్చి) యుద్ధములో జయించినవాఁడవు నీవొక్కఁడవే కావు. జయాపజయములు పరిస్థితులంబట్టి యుండును. ఎప్పుడీగర్వోక్తు లేల? పాదుషావారిచ్చటనే యున్నారు. సంధిచేయుట కొడంబడుదురేని చూడవచ్చును. లేకున్న నాకంఠములోఁ బ్రాణమున్నంతవఱకు మీరు వారిం డాయఁజాలరు.

దుర్గా—అట్లయిన మా రాణావారదే శిబిరములో నున్నారు. షరతులు విందురు గాని రండు.

దిలేర్ఖాను—సరియే (ఇరువురు శిబిరములోనున్న రాణావారి దర్శింతురు.)

రాజసింహు—దుర్గాదాసా రమ్ము! రమ్ము! వీ రెవ్వరు?

దుర్గా—వీరు మొగలాయీ సేనానాయకులు! సంధింగోరి ఢిల్లీశ్వరుఁడు షరతులకై రాణావారి దర్శనమునకుం బంచెను.

రాజ—షరతుల కేమున్నది.

సీ. రసపుత్రరాజ్యముల్ వశమందునున్న నా
యా రాజులకు నిచ్చి తీరవలయు;
విమతంపుఁబ్రజలపై విధియించు తలపన్ను
విధిగా నీఁకను గొట్టివేయవలయు;
జస్వంతసింహు రాజ్యము సొత్తును దదీయ
పుత్రు నజితసింహుఁ బొందవలయు;
అన్యమతమ్ము జోక్యముఁబోక పాదుషా
యందఱి సమబుద్ధి నరయవలయు;

ఇన్నిపరతులకును దనకిష్టమేని
ఇదిమొదలు షాదుషా మాకు హితుఁడగుఁజుము
ఒండువిధమేని రసపుత్రయోధబాహు
మండితాసికి దయ యను టుండ దనుము. 180

ఠకే—(తనలో) అక్కటా! వీరికోర్కులు హిరణ్యాత్మకరములుగా నున్నవే! సరియే మనవిచేసి వచ్చెద. (లోనికిఁజని మరలవచ్చి) ఆర్యా! మీపరతులు మా కంగీకృతము లైనవి. ఇఁక యుద్ధ మాపివేయుండుఁడు.

రాజ—మంచిది (దుర్గాదాసుతో) దుర్గాదాసా! తురకలు శరణుజొచ్చిరి కావున యుద్ధ మాపివేయ మనదళముల కుత్తరు వొసంగుము.

దుర్గా—చిత్తము.

ఉ. ఓరహతూరువీరగజయూథములార! విరోధివాహినీ
సారసపాళి త్రుంగ దమసామి యిమూదు పరాఙ్ముఖుఁడుగా
మీ రిఁక శాంతిఁబొందనగు నీనిశితాయుధరాజికోడ నో
హో! రసపుత్రయోధగజయూథమ నీవును శాంతిపొందుమా!

రాజ—దుర్గాదాసా! ఇఁకఁ జేయవలసిన పనియేమి?

మ. సిగపూ వాడక తెచ్చినాడవు జయశ్రీకన్యకన్ స్వీయధై
ర్యగరీయఃప్రతిమానపౌరుషము శుల్కంబిచ్చి చిత్తాయకో
టగడింపన్ నిజగాత్రరక్తమును వేడ్కన్ ధారవోయంగ నీ
కుఁగదా చెల్లె నిఁ కేమిచేయవలె! శాహూర్కిరకంఠీరవా! 182

దుర్గ—స్వామీ! దేవరవారి భృత్యుఁడు స్వధర్మముం జేసె. ఇఁక నొక్కయుపకృత్యము మాత్రమున్నది.

గీ. నీదుమేనల్లు ప్రాణముల్ నిలిపినావు
యోధపురరాజ్యలక్ష్మి నా కొసఁగినావు
మించి షాదుషాగర్వ మడంచినావు
విమల శపథంబు చెల్లింప వెడలవలయు. 183

రాజ—విమలచారిత్రము నాకు విచిత్రముగానున్నది. నాఁడు మన్యదుర్గమున నెవ్వరినో పురుషునిఁ జూచి నేనని భ్రమించినది. నిజ మారయుచుండ మాకు మహోపకారియగు యోగి వచ్చి తొందరపెట్టెను. అన్నట్టు జ్ఞాపకమునకు వచ్చినది. యుద్ధ మారంభమయిన నాఁటినుండియు నతం డంతర్ధానమయ్యె.

దుర్గా—స్వామీ! దీని యథార్థమంతయు నిప్పుడే తెలియఁగలదు. కోటలోనికి దయచేయుఁడు. (నిష్క్రమింపఁ దెర జాఱును)

## రంగము:—చిత్తూరుకోటలో రాణాకొలువుకూటము.

[రాణావా రుచితపరివారముతో విశ్రమించి యుండఁగా యోధవేషముతో విమలయు వీరమాతయుఁ బ్రవేశించి రాణావారికిఁ బ్రణమిల్లుదురు.]

రాజ—(వీరమాతవైపుఁ జూపి) ఈవీరపూరుషుండే నాఁడు మన్యదుర్గమున విమలను భ్రమింపఁజేసినవాఁడు. నిన్న నీతఁడే యుద్ధమునందు మనపక్షమున మిక్కిలి సాయముచేసినాఁడు. ఈతనిచరిత్ర మతివిచిత్రముగా నున్నది. ఈతని కుల గోత్రనామంబు లేవియో కనుఁగొందమా!

దుర్గా—ఇఁక నొకనిమిషములో రాణావారికి సర్వము విశదము కాఁగలదు.

రాజ—ఈతనితో వచ్చిన బాలకుం డెవ్వాఁడోగాని నాకుఁ బ్రాణావసర కాలంబున బాసటయై కదనరంగంబున మహోపకారము గావించెను. ఆతనిని బహూకరింపవలయును.

వీర—రాజచంద్రా! ఇతఁడు తమ ప్రాణావసరకాలమునఁ దోడుపడుట కిదియే మొదటితడవు కాదఁట. (విమలం జూచి నవ్వుచు) ఆబహుమానమేదో తమ చేతులతోడనే యొసంగవలయునఁట.

రాజ—(సాలోచనముగా) ఇదియే మొదటితడవుకాదా! ప్రాణదాతనే పరాకుపడితినా! (స్మృతి నభినయించి) నాఁ డాసరోవరతీరంబు మాటుయా యేమి చెప్పుమా! ఆమె విమలగదా. మరెవ్వరు నన్ను సంరక్షించె. (విమలతో) అయ్యా! క్షమించి మీ మోమొకపరి చూడనిచ్చెదరా! జ్ఞప్తికిఁ దెచ్చుకొందును.

విమల—(చిఱునవ్వునవ్వి సిగ్గుచే లోనికిఁ బోఁబోవును.)

వీర—(పట్టుకొని) ఓయీ! ఆగు మాగుము. ఇదే రాణావారు నిన్ను బహుమానింతురు.

విమల—(విడిపించుకొని లోనికిఁ బోఁబోవును.)

రవి—విమలా! ఇఁక నెంతకాలము దాఁచెదవులే నీగుట్టు!

విమల—మీగుట్టుమాత్ర మట్టె దాఁగియుండునా యేమి ?

రాజ—ఏమీ! వీరిభావము. ఈమె నాసోదరి విమలయా! మఱి యీరూపము మాత్రము పురుషరూప మెట్లగు? నాఁడు మన్యదుర్గమునఁ గాచిన వాఁడునం డియు నా కనుమానము కలదు.

దుర్గా—మహారాజా! ఇఁక దాఁపనేల ?

గీ. యోధపురరాజ్ఞి యీమె నీసోదరి సుమి
పోర నినుఁ గాచిన యదూరధీర విమల
ఐరి యవనుల నొంప సన్యాసి నేను
మాకు నజ్ఞాతమిది దీక్ష నీకతమున. 184

రాజ—ఈమె నాసోదరి వీరమాతయా! అక్కా నమస్కారము.

వీర—కళ్యాణసిద్ధిరస్తు.

దుర్గా—అమ్మా! యాశీర్వాదము కాదు నాకే మఱఁదలి నలంకరించి తీసికొనిరండు.

(విమలయు వీరమాతయు నిష్క్రమింతురు.)

రాజ—ఆహా! దుర్గాదాసా! మాకు మహోపకారము చేసిన యోగివి నీవేనా? అయ్యా! నీ ఋణము మే మెట్లు తీర్చుకోఁగలము.

చ. అవిరళరాజభక్తి కిరవై నిజలాభవిరక్తి గల్గువా
డెవఁ డన దుర్గదాసుఁ డొకఁడే యని నిత్యము నీసుకీర్తి యా
ధవళహిమాద్రిసేతువుల దాఁటి జగంబుల నాక్రమించి, ఆ
రవిశశితారకంబుగను రంజిలు యోధపురీసుధీనిధీ. 185

దుర్గా—మహారాజా! స్వధర్మమగుటచే నావిధి నేఁ జేసియుంటిని. దీని కింతగాఁ బ్రశంసింపనేల ? అదిగాక యీవిషయములలో నా కింతపట్టుదల కలుగుటకు మఱియొక కారణము గలదు.

శా. ఆజస్వంతుఁడు నీకు బావ మును దాఁ బ్రాణంబు గోల్పోవునాఁ
డేఁ జేరం జన నాదు కేలఁ దనకే లిట్లుంచి "యోదుర్గదా
సా! జోధ్పూరును గాచుభార మిఁకనీ" దంచుఁ వడిం జెప్పె;నా
రాజోత్తంసము మాటఁబట్టి యిటు తీవ్రింబూనితిఁ యోగినై. 186

[అంత నజితసింహునితో మంజరీసావళులు ప్రవేశింతురు]

దుర్గా—బావా! సావళా! ఇందిరా! సోదరీ! మీరెచ్చటనుండి వచ్చితిరి?

సావ—మీరు యోగిగానున్నతఱి పకీరువేషమునున్న చారుఁడను నేనే. మంజరి యను విమలపరిచారికయే మీసోదరి.

దుర్గా—యోగివేషమున నే నందఱిని మోసముచేయ మీరు నన్నే మోసముచేసితిరే!

అజి—మామయ్యా! నమస్కారము. మాజనయిత్రి యెక్కడ?

రాజ—అజితా! ఇప్పుడే వచ్చును.

[వివాహోచితాలంకృతయగు విమలతో వీరమాత ప్రవేశించును.]

వీరమాత—కుమారా! ఎన్నిదినంబులకు నిన్నుఁ జూడఁగంటినోయి! (ఎత్తికొద్దాడును)

విమల—(అజితుని ముద్దిడును.)

వీర—విమలా! మఱఁదలమాణిక్యమా! ఇఁక నాలస్యమేల? ఇదే! నీకునోహారుని మెడయందు దీప్తాలహారము వేయుము.

విమల—(సిగ్గుచే మొగము వాంచి యూరకుండును.)

వీరమా—విమలా ఎంతసిగ్గులాడివే! సిగ్గుమాలిన నీపాలుసిగ్గువడు సిగ్గుచెప్పినట్లు చేసెదనిటు రమ్ము.

గీ. కొలవికెలఁకున ము న్నపుడ్గొనినసిగ్గు
భైరవీదేవి గుడి నప్పుఁ బడినసిగ్గు
నిన్న మార్గమున వెల్తిఁ గన్నసిగ్గు
వృద్ధితోఁ దీర్చుచున్నావె విభున కిపుడు.

(విమలచేఁ బూలహారము వేయించును.)

దుర్గా—స్వామీ! మాకుమారమహారాజావారిపట్టాభిషేకమునకు దేవిగారును దమరును దయచేసి తదుత్సవము చేయింపవలయును.

రాజ—అభ్యంతరమేమి? రసపుత్రులకు విజయమైనది కావున నిట్లగుఁగాక!

(భరతవాక్యము.)

తరల. ప్రజలపై దయ గల్గి రాజులు పాలనం బొనరించుతన్
ప్రజలు రాజుల భక్తిఁ గొల్చి యపారసౌఖ్యము లందుతన్
సుజనగోద్విజరక్షణంబు వసుంధరం దిర మయ్యెడిన్
విజయియై హితకారిణీసభ వృద్ధి గాంచుత మెప్పుడున్. 188

సమాప్తము.



# రాణాప్రతాపసింగ్

గ్రంథకర్త: ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు.

ఇందలికథ మన భారతవర్ష చారిత్రమునకెల్ల, నమూల్యాలంకార సదృశమును. వీరక్కథానాయకాగ్రణి భారత సామ్రాజ్యములలో మేవారుమణిగాఁ బేర్కొనదగు చిత్తూరి మహారాణాయగు 'రాణా ప్రతాపసింగు' అద్వితీయ రాజనీతి కోవిదుండగు నక్బరు పాదుషాయంతవాడు తన్ను సాధింపనెంచి చతురోపాయంబుల సహాయశక్తుల నెంత ప్రయత్నించినను, జితోస్మి యనుమాట తననోట రానీయక యిరువదిసంవత్సరములకు బైగా నాటవికులమధ్య భార్యాపుత్రులతో పడరాని యిక్కట్టులకుం బాల్పడి తట్టుకుదను మ్లేచ్ఛసామ్రాజ్యముని, మహాసైన్యమును అదరిక్కుకులగు హిందూ మహమ్మదీయ దండనాయకులను, స్వకీయ మహాబల ప్రసారంబున మూడిబుగవలెఁ బాఱద్రోలి శత్రువశమైన దుర్గములతో పాటు రాజధానియగు నుదయపురమును స్వాధీనము చేసికొని మేవాడ రాజ్యలక్ష్మికి మ్లేచ్ఛసంపర్క కళంకము లేకుండఁజేసి రిసప్రతిప్రతిష్ఠ పునరుద్ధారణముచేసిన మహానుభావుని చరిత్రము. అత్యద్భుతముగా వర్ణింపఁబడినది. ప్రతాపసింగు సోదరుడగు సాగరజీ శత్రులలో కలిసి యుద్ధమునకు వచ్చుట, బాణభట్టుయొక్క సహాయవాత్సల్యము' జయసింగు ధైర్యశౌర్యములతో శత్రువుల నోడించుట, అక్బరు ఆడదానివేషముతో పండ్లు అమ్ముట—యిచ్చట ప్రతివారికి అక్బరును చూచిన నవ్వు రాకమానదు. చిత్రకారిణియొక్క తమాషాలు, చంద్రకళయను భోగముదిచేయువింతలు, మాన్‌సింగుయొక్క కుట్రలు, సలీమ్‌యొక్క సరదా గులామ్‌యొక్క హాస్యరసమైన మాటలు, రణమల్లుని విచారము, మోహినియొక్క ఉపచారము, తుదకు జయసింహ మోహినీల వివాహముతో చక్కనిపద్యరత్నములతో నవరసము లొలికించునట్లుగా రచియింపఁబడినది. అనేకచోట్ల ప్రదర్శింపఁబడినది. కొలది ప్రతులుమాత్రమే గలవు. త్వరపడుడు.

వెల స్వల్పము రు 1—0—0 మాత్రము

వలయువారు:—

కారుమూరి సుబ్బారావు, సరస్వతీబుక్కుడిపో బెజవాడ.

# భగవద్గీత

పద్యకావ్యము.

గ్రంథకర్త: పూర్వకవి వేముగంటి దత్తోజీ పండిత ప్రణీతము.

ఈపుస్తకము నైజాం రాజ్యమందు సంపాదింపబడిన తాళపత్ర గ్రంథము నూతనముగా అచ్చువేయబడినది. ఈకవియొక్క శైలి ద్రాక్షాపాకము. ప్రతిపద్యము నందును రసము లొలుకుచుండును. శ్రీకృష్ణుఁడు అర్జునునకు ఉపదేశించిన పద్దెనిమిది యధ్యాయములు చక్కనిశైలిని, మృదుమధురములగు పద్యములతో, రచియించినారు. భక్తిరసప్రధానము. ప్రతివారుపఠింపతగినది. ప్రతియింటనుండతగినది. వెల 1—0—0

# భజనకీర్తనలు

(గ్రంథకర్త: చిలుకూరి కృష్ణమ్మదాసు గారు.)

శ్రీరామాయణమంతయు చక్కనిశైలిని భజనపరులకు నుపయోగించులాగునరచియింపఁబడినది. చక్కని కీర్తనలు, యీకీర్తనలు అనేకచోట్ల భజనలలో పాడబడుచున్నవి. వెలస్వల్పము. ఫలమధికము. వెల రు 0—4—0 మాత్రమే.

# అధ్యాత్మ రామాయణకీర్తనలు.

ఇది పురాతన కవీశ్వరుండగు సుబ్రహ్మణ్యకవిచే రచియింపబడి యిప్పటివరకు ఆంధ్రదేశమున మహావిఖ్యాతిగాంచుచున్న రామాయణ వేదాంత అంతరార్థబోధకము లు కీర్తనలు గ్రంథము తప్పులులేకుండా శుద్ధప్రతి ముద్రించి యుంచినారము.

వెల 0—8—0

---

కురుసూరి సుబ్బారావు, సరస్వతీబుక్కుడిపో బెజవాడ.